# చార్లీ చాప్లిన్

(జీవిత సంగ్రహం)

వాసిరెడ్డి భాస్కర రావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**Charli Chaplin - Vasireddy Bhaskara Rao**

ప్రచురణ నెం. : 2310

ప్రతులు : 1000

గత ముద్రణలు : 1984, 88, 89, 90

ఐదవ ముద్రణ, మార్చి, 2002.



**వెల : రూ. 30-00**

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంకు స్ట్రీట్,

హైదరాబాదు - 500 001.

E-mail : visalaandhraph@yahoo com

&

**విశాలాంధ్ర బుక్ హౌస్**

విజయవాడ, హైదరాబాదు (సుల్తాన్ బజార్, బ్యాంకు స్ట్రీట్),

అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

# మా మాట

చార్లీ చాప్లిన్ ప్రధానంగా కళాకారుడు, హృదయం గల కళాకారుడు. పెట్టుబడిదారీ సామ్రాజ్య వ్యవస్థలో మానవతా విలువల విధ్వంసాన్ని చూసి, అనుభవించి, బహు రూపాలలో తత్కారిన్యాన్ని, అమానుషత్వాన్ని నిరసించిన మానవతావాది. శ్రమఫలితానికి దూరమైన శ్రామికుడు, పరాయీకరణకు గురై సర్వమానసిక వైపరీత్యాలను స్వయంగా అనుభవించిన వాడు. ఆ అనుభవాలను కళాత్మకంగా వెండితెరపై కెక్కించిన భావుకుడు.

చాప్లిన్‌ను అలాగే చూడాలి. సమస్యలకు పరిష్కారం చూపటం కళాకారుల స్థాయికి మించినది. ఆ ప్రమాణంతో కళాకారులను కొలిస్తే మిగతా వారు బహుస్వల్పం. మానవ క్షోభం యొక్క లోతుపాతులను తవ్వి తలకెత్తి పరిష్కారం మీరే ఆలోచించండి అంటే చాలు.

అదే చాప్లిన్ చేశాడు. ఆ దృష్ట్యా చాప్లిన్ జీవితాన్ని అధ్యయనం చేయటమే సరైన పద్ధతి.

1988 లో ప్రచురించిన ద్వితీయ ముద్రణను పాఠకులు ఎంతో ఆదరించారు. ఈ ముద్రణనూ పాఠకులకు అందిస్తున్నందుకు సంతోషిస్తున్నాము.

హైదరాబాదు
16-4-1989

ప్రచురణ కర్తలు

# మొదటి ముద్రణకు
# నా మాట

జీవితం ఎన్నో సంఘటనల నిలయం. అటువంటి సంఘటనల్లో ఒకటి చార్లీ చాప్లిన్ జీవిత చరిత్ర వ్రాయటానికి నన్ను ప్రోత్సహించింది. ఒకనాడు బ్యాంక్ మేనేజర్ శ్రీ దత్తాత్రేయ శర్మగారి వద్దకు వెళ్ళాను. అప్పుడు ఆయన బల్లమీద వున్న రెండు పుస్తకాలను చూడటం తటస్థించింది. అందులో చార్లీ చాప్లిన్ స్వీయ చరిత్ర గ్రంథం ఒకటి. అంతకు ముందు వారం రోజుల క్రితం హైదరబాద్‌లో చాప్లిన్ 'మోడర్న్ టైమ్స్' చిత్రం చూడటం జరిగింది. వరంగల్ ఫిల్మ్ సొసైటీ వారు 'ది కిడ్', 'ది గోల్డ్ రష్' యితర చిత్రాలను ప్రదర్శించారు. వాటిని చూచాను. నేను వరంగల్ ఫిల్మ్ సొసైటీ స్థాపన నుండే తగు పాత్ర వహిస్తూ; మూడేళ్ళ నుండి సొసైటీ అధ్యక్షునిగా ఉండటంతో మంచి సినిమాలను చూడటం, సినిమాలను విమర్శనాత్మకంగా పరిశీలించడం జరుగుతోంది. శర్మగారు మా సొసైటీలో సభ్యులు. మాటల సందర్భంలో చాప్లిన్ తన స్వీయ చరిత్రను చాలా చక్కగా వ్రాశాడని ఆయనన్నారు. చదివిస్తానని ఆ పుస్తకాన్ని తెచ్చాను. దాన్ని శ్రద్ధగా చదివిన నేను ఎంతో ఉత్తేజాన్ని పొందాను. చాప్లిన్ కళా జీవితాన్ని తెలుగు పాఠకలోకానికి ఎందుకు పరిచయం చేయకూడదు ? అని అనుకున్నాను. అమెరికన్ రిసెర్చి గ్రంథాలయానికి పోయి కొన్ని గ్రంథాలను సేకరించి, మిత్రుల వద్ద నుండి మరిన్ని గ్రంథాలను తెచ్చీ చాలా క్లుప్తంగా, సంగ్రహంగా చార్లీ చాప్లిన్ జీవిత చరిత్రను వ్రాయటం ప్రారంభించాను.

'ప్రజాసాహితి' సంపాదకుడు శ్రీ వాసిరెడ్డి నవీన్ ఈ విషయం విని, చాప్లిన్ సంస్మరణ సంచికకు ఒక వ్యాసం వ్రాయమని కోరారు. చాప్లిన్ సినిమాలు రెండింటిమీద వ్రాసిన వ్యాసాన్ని డిసెంబర్ 1983 'ప్రజాసాహితి'లో ప్రచురించి నా కెంతో ప్రోత్సాహాన్ని ఇచ్చారు

వరంగల్ ఫిల్మ్ సొసైటీ మిత్రులు శ్రీ జీవన్ కుమార్, శ్రీ శ్యామ్ సుందర్‌లు చాప్లిన్‌పై కొన్ని పుస్తకాలను సమకూర్చి నా ప్రయత్నానికి చాలా సహాయం చేశారు.

ఆంగ్ల భాషను ఆంధ్రభాషలోకి అనువదించే క్రమంలో ఎన్నో

# విషయసూచిక

# ఉపయుక్త గ్రంథాలు (References)


1. చార్లీ చాప్లిన్ : మై ఆటో బయోగ్రఫీ, పాకెట్ బుక్స్, న్యూయార్క్, 1964.

2. రాబర్ట్ పేన్, ది గ్రేట్ చార్లీ, పాన్ బుక్స్, లండన్, రివైజ్డ్ ఎడిషన్ 1957.

3. రోగర్ మాన్‌వెల్, చాప్లిన్, లిటిల్ బ్రౌన్ కంపెనీ, బోస్టన్, 1974.

4. జాన్ మాకెబె, చార్లీ చాప్లిన్, బౌబుల్ డే కంపెనీ, గార్డెన్ సిటీ, న్యూయార్క్, 1978

5. డోనాల్డ్ మెక్కఫ్రే, ఫోకస్ ఆన్ చాప్లిన్, ప్రెంటిస్ హాల్, న్యూజెర్సి 1974.

6. ఫ్రాన్సిస్ ట్రుఫ్ఫాట్, ది ఫిల్మ్స్ యిన్ మై లైఫ్, ది గ్రేట్ డిక్టేటర్.

7. హ్యూమర్ యిన్ సినిమా, సినిమా సర్కిల్ హైద్రాబాద్, ఫిబ్రవరి 20-21, 1982.

8. కొడవటిగంటి కుటుంబరావు, చార్లీ చాప్లిన్ సినిమాకళ, చిత్రసంస్కార, విజయవాడ, ఆగస్టు, 10, 1977.

9. ఎన్నార్, ప్రజా నటుడు, ప్రజా దర్శకుడు, చార్లీ చాప్లిన్, చిత్ర సంస్కార, విజయవాడ, జనవరి 10, 1979.

10. సంపాదకీయం, సృజన, వరంగల్, జనవరి 1978.

11. వాసిరెడ్డి భాస్కరరావు, మానవాళికి ఆశా సందేశాన్నిచ్చే రెండు సినిమాలు : చాప్లిన్ సంస్మరణ, ప్రజాసాహితి, హైద్రాబాద్, డిసెంబర్ 1983.

# పరిచయం

ఇరవైయవ శతాబ్దంలో అత్యున్నత గౌరవం పొందిన కళాకారుల్లో చార్లీ చాప్లిన్ ప్రథముడు. చాప్లిన్ మహానటుడు. హాస్య వినోద చక్రవర్తి. చాప్లిన్ సాధారణ రీతికి భిన్నంగా చిత్రంగా ధరించిన దుస్తులతో వంకర టింకర నడక (Tight Rope Walk) తో, చేతి వంకె కర్రతో, ఆ పాత్ర (Tramp) చేసే చేష్టలు, చిన్న టోపి (Derby Hat) అమాయకంగా మిలమిలలాడే కళ్లు, మాటల ద్వారా కాకుండా, వేషం, మూగ నటన ద్వారానే ప్రేక్షకులందరినీ కడుపుబ్బ నవ్విస్తాడు. అనేక రకాలుగా అందరినీ గలగల లాడిస్తాడు. నవ్వుతో పాటే, అ నవ్వు నుండే దుఃఖం అలలుగా పొర్లుకొస్తుంది. ఆ వినోదం, ఆ విషాదం రెండూ జీవిత సత్యాలే. అవి జీవితానికి బొమ్మ, బొరుసూ లాంటివి.

నవరసాల్లోని హాస్యాన్నీ, కరుణని సమపాళ్లలో రంగరించి వెండితెర మీద ప్రదర్శించి ప్రేక్షకుల కళ్ళ పొరలను తొలగిస్తాడు. జీవిత సత్యాలను ఈ రెండు రసాల విచిత్ర సంయోగం (Tragic Comedy) ద్వారా అద్భుతంగా చిత్రిస్తాడు. ఇదే ప్రత్యేకంగా పేర్కొనదగిన చాప్లిన్ విశిష్టత. ఇటువంటి రస సృష్టిని నూతనంగా ప్రయోగం చేసిన వాళ్ళలో అయన మొదటి వాడూ, ఆఖరి వాడుగా చెప్పవచ్చు.

చాప్లిన్ ఈ రస సంయోగాన్ని చార్లీ వ్యక్తిగతమైన జీవితానుభవాల నుండే సృష్టించాడు. జీవిత వాస్తవాలను ప్రతిబింబింప చేయటానికై ఒక విచిత్ర వేషదారి (Tramp) ని తన ప్రముఖ పాత్రగా తానే సృష్టించాడు. దాని ద్వారా దాదాపు వందకు పైగా చిత్రాలలో వివిధ రకాలైన పాత్రలను నటించాడు. అది అపూర్వమైన పాత్ర. ఆ విచిత్ర పాత్రధారి పైకి దేశదిమ్మరి, తిరుగుబోతు, జోకర్, బఫూన్, హాస్యగాడు, విదూషకుడుగా కన్పడినా, అమితంగా హాస్యాన్ని, పరిహాసాన్నీ, వ్యంగ్యాన్నీ, అపహాస్యాన్నీ, అసహ్యాన్నీ కల్గించినా ఆపాత్ర అసలు రూపం అది కాదు. వాటిలో అంతర్లీనమైన ఆవేశం వెనుక ఎంతో విషాదాత్మకమైన, కరుణాత్మకమైన స్వరూపంగల మరో పాత్ర వుంది.

చాప్లిన్ సినిమాలు చూస్తున్నంతసేపూ ఒక ఊహా భావంతో ప్రేక్షకులు ముగ్ధులవుతారు. అంతా విరగబడి, పగలబడి, హాయిగా ఆనందంగా నవ్వుతారు. సినిమా చూచిన తర్వాత నెమ్మదిగా మరొక వూహా భావం ప్రేక్షకులను నిశ్శబ్దుల్ని

చేసి, మౌనంగా ఆలోచింపజేస్తుంది. జీవిత సత్యాన్ని గ్రహింపజేస్తుంది. అలా వినోదాన్ని కురిపిస్తూ, విషాదాన్ని కలిగించేవి, ఆలోచింపజేసేవి చాప్లిన్ సినిమాలు మాత్రమే. ఇంకా యే కళాఖండాలను చూచినా ఈ అనుభవం కలుగదు. ప్రేక్షకులను కష్టపెట్టకుండా చిత్రంలో కష్టాలన్నీ తానే భరిస్తూ తన అభాగ్యస్థితిలో కష్టనష్టాలతో, దారిద్ర్యంతో వినోద భాగ్యాన్నిస్తాడు. వారి హృదయాలకు సన్నిహితుడౌతాడు. వారి మేధస్సును ఆలోచింపజేస్తాడు. ఈ విధంగా సఫలీకృతుడు కావటానికి చార్లీ నిజజీవితంలో ఎన్నో కష్టాలకు గురికావలసి వచ్చేది. కష్టాలను లెక్కచేయకుండా చార్లీ ఆలోచించడాన్ని అభ్యసిస్తూ క్రమంగా తన చిత్రాలకు తానే రచయిత అయ్యాడు. తానే నటుడు, సంగీతమూ తానే. దర్శకత్వం తనదే. కొన్ని సినిమాలకు తానే నిర్మాత. సర్వస్వం అయ్యాడు. ఆ విధంగా చార్లీ గొప్ప దార్శనికుడు, స్వాప్నికుడు, గొప్ప రచయిత, సంగీత ప్రవర్తకుడు, మహానటుడు, గొప్ప కళాకారుడు, యుద్ధ వ్యతిరేకి, శాంతికాముకుడు, మానవతావాది, సాధారణ లోకంలో విశిష్ట వ్యక్తిత్వంగల ప్రపంచ పౌరుడు. కళా ప్రపంచంలో స్రష్ట, ద్రష్ట.

సినిమాలలో చాప్లిన్ పొట్టిగా, వికారంగా, విచిత్రంగా కన్పడినా చార్లీ అందగాడు. సౌందర్య పిపాసి-జీవన యాత్రికుడు, మహా పథికుడు; సత్యశోధకుడు, సాహసికుడు, నిగర్వి సున్నితహృదయుడు. విశాల దృష్టిగల నాగరికుడు. ఏ దేశమేగినా, ఏ సమాజంలోనైనా లక్షలాది ప్రేక్షకుల అభిమానం పొందాడు. ఇటువంటి వ్యక్తిత్వంగల హాస్య కరుణాన్వితమైన కళాకారుడుగా ప్రపంచ చరిత్రలో చార్లీ చాప్లిన్ తనొక్కడిగానే మిగిలిపోవచ్చు.

చార్లీ చాప్లిన్ జీవితం మొదటి నుండి చివరివరకూ, అఖరికి మరణానంతరం కూడా చారిత్రాత్మకమైంది. చార్లీ బాధామయ ప్రపంచంలో 89 సంవత్సరాలు జీవించి, నిర్విరామంగా కృషిచేసి 1977 లో నిష్క్రమించాడు. చరిత్రాత్మకమైన చార్లీ జీవితాన్ని ప్రధానంగా ఆయన స్వీయ చరిత్ర నుండి, ఇతర విమర్శనాత్మక రచనల నుండి సమన్వయించి చాప్లిన్ జీవితాన్ని తెలుగు పాఠకుల హృదయాల్లో సంగ్రహంగా ప్రతిబింబింపజేయటమే ఈ రచన ముఖ్యోద్దేశం. ఈ దృష్టితో చేసిన విశ్లేషణలో అన్ని రకాల విమర్శనాత్మక ధోరణి ఉంటే ఉండవచ్చు.

# చార్లీ బాల్యం

చార్లీ చాప్లిన్ 1889 ఏప్రిల్ 16న రాత్రి 8 గంటలకు ఈస్ట్‌లేన్, వాల్‌వర్త్, ఇంగ్లాండులో జన్మించాడు. ఆ తర్వాత చాప్లిన్ తల్లి హన్నా (Hannah) తన పెద్ద కుమారుడైన సిడ్నీతో లండన్ నగరానికి తమ నివాసాన్ని మార్చారు. చాప్లిన్ తల్లి చాలా అందగత్తె, హాస్యనటి, గాయకురాలు. పాటలు పాడి సంసారాన్ని ఈడ్చుకొచ్చేది చాప్లిన్ తండ్రి కూడా మంచి నటుడు, సంగీత కళాకారుడు, మంచి పేరు సంపాదించాడు. కాని పెద్ద త్రాగుబోతు. అందుకనే చార్లీ తల్లి తన భర్తతో వుండేది కాదు. చార్లీ తన తండ్రితో వుంది కొద్దికాలం మాత్రమే. ఆయన తండ్రి తాగి చివరకు తన ముప్పది ఏడవ యేట చనిపోయాడు. చార్లీ తల్లీ, తండ్రి వయస్సులో వుండగా ప్రేమించుకున్నారు. కాని చార్లీ తల్లి పెళ్ళికాకముందే ఒక ధనవంతునితో ఆఫ్రికాకు వెళ్ళి, అతన్ని పెళ్లి చేసుకొని సిడ్నీని కని, అతడ్ని వదిలిపెట్టి ఇంగ్లాండు వచ్చింది. చార్లీ తండ్రిని వివాహమాడి చార్లీని కన్నది. అప్పటిలో చార్లీ తల్లిదండ్రులిద్దరూ మంచి నటీనటులే నాటకాలలో వచ్చిన ఆదాయంతో గడిపారు. చార్లీ తల్లి, తన భర్తను వదిలిపెట్టిన తర్వాత, ఆయన ఇంకొక వివాహం చేసుకొని ఆ రెండవ భార్యతోనే వుంటూ, చార్లీ కుటుంబానికి కొంత ఆర్థిక సహాయం చేస్తుండేవాడు. చార్లీ తల్లి పాటలు పాడి కొంత సంపాదించేది. అయినా సరిపోయేది కాదు. చాప్లిన్ తల్లి ఆరోగ్యం అంతగా బాగుండేది కాదు. జలుబుతో గొంతు పూడుకుపోతూండేది ! కనుక పాటలు పాడేప్పుడు మధ్యలో గొంతు సరిగా పని చేసేదికాదు. కీచుగొంతు వచ్చేది. అటువంటి సమయాల్లో ప్రేక్షకులు గొడవ చేసేవాళ్ళు.

ఒక రోజు ఆమె నాటకంలో పాడుతూండగా స్వరం బలహీనమైపోయి ప్రేక్షకులు అల్లరి చేయటంతో ఆమె స్టేజినుండి లోపలికి నిష్క్రమించడం జరిగింది. తల్లితో పాటు నాటకానికి పోయిన చార్లీని ఎవరో స్టేజిమీదకు తీసుకపోయారు. అయిదేళ్ళ చార్లీ పాడటం మొదలు పెట్టాడు. చార్లీ పాటకు ఆనందించి ప్రేక్షకులు స్టేజి మీదకు డబ్బులు విసిరారు. వెంటనే పాట ఆపి చార్లీ డబ్బు పోగుచేయటం మొదలు పెట్టాడు. తర్వాత మళ్ళీ పాడటం, ప్రేక్షకులతో మాట్లాడ్డం నృత్యం చేయటం, తల్లి నటననీ, ఆమె కీచుగొంతునీ అనుకరించటం. ప్రేక్షకులు విపరీతంగా నవ్వుకుంటూ డబ్బు విసరివేయడం జరిగింది. చార్లీ చాప్లిన్ నటనా జీవితం ఆ విధంగా ఆకర్షకంగా అయిదేళ్ళ ప్రాయంలోనే ప్రారంభమైంది.

ఆ రోజుతోనే చార్లీ తల్లి అనారోగ్యం దృష్ట్యా నటనా జీవితానికి స్వస్తి చెప్పింది. చాప్లిన్ కుటుంబం దారిద్ర్యానికి నిలయమైంది. చాలా కష్టాలుపడ్డారు. చిన్న చిన్న గదుల్లో దుర్భరమైన బాధలు అనుభవించారు. తల్లికి వేరే ఉద్యోగం దొరకలేదు. ఆమె గొంతు బాగుపడుతుందేమోనని భగవంతుని ప్రార్థిస్తూ, మతాన్ని నమ్ముకుంది. ఇంట్లో వున్న సామాన్యమైన వస్తువులను కూడా అమ్ముకున్నారు. అమె అనారోగ్యంతో అద్దెకు తెచ్చిన చిన్న కుట్టుమిషన్‌తో, బట్టలుకుట్టి బహుకొద్దిగా సంపాదించి సిడ్నీకి, చార్లీకి పెట్టి తాను పస్తులుండేది. ఆరోగ్యం పూర్తిగా పాడైపోయింది వారు ఒకే గదిలో జీవితాన్ని ఈడుస్తూ గడిపారు. చివరకు తన తండ్రి వారం వారం యివ్వవలసిన పది షిల్లింగులు కూడా రావటం ఆగిపోయాయి. వేరే దిక్కులేక పిల్లలిద్దరిని పోషించలేక ముగ్గురూ కలిసి అనాధాశ్రయంలో జేరారు. అటువంటిపని ఆ రోజుల్లో ఎంతో సిగ్గుమాలిన పని, అయినా గత్యంతరం లేక అలా చేయవలసి వచ్చింది. అనాధాశ్రయంలో చేరటంతో తల్లీ, తనూ, అన్న ముగ్గురూ మొదటిసారిగా విడిపోవటం జరిగింది. అప్పుడు చార్లీ వయస్సు ఏడేండ్లు.

అనాధాశ్రయం బడిలో చాలా చిన్న తప్పులకు కూడా పెద్దశిక్ష విధించే వాళ్లు. తప్పుచేసిన వాళ్ళ జాబితాలో ఒకరోజు చార్లీ పేరు కూడా చేర్చారు. అతడు మరుగుదొడ్డికి నిప్పు పెట్టాడని అభియోగం. ఆ పని వేరే పిల్లలు చేశారు. కాని దొడ్డిలో కట్టెలు కాలుతుండగా చార్లీ అక్కడే పట్టుబడ్డాడు. కనుక నేరాన్ని ఒప్పుకోమన్నారు. ఇందులో తనపాత్ర ఏమీ లేకపోయినా తప్పుచేశానని గొణిగాడు. కాని ధైర్యంగా శిక్ష అనుభవించాననుకున్నాడు. (ఇదీ మన చార్లీ వరుస! చేయని తప్పులు ఒప్పుకొని ధైర్యంగా శిక్ష ననుభవించడం!)

అతని కంటే నాలుగేండ్లు పెద్దయైన అన్న సిడ్నీకి నౌకలో చిన్న నౌకరు పని దొరకటంతో ముగ్గురూ ఆనాధాశ్రయం బయటికి వచ్చి, లండన్ కెన్నింగ్టన్ పార్కు వీధిలో ఒక చిన్న గది తీసుకొని మళ్ళీ దుర్భర జీవితాన్ని ప్రారంభించారు. తల్లికి పనిదొరకకపోవటంతో మళ్ళీ కొద్దివారాలకే చార్లీతో అనాధాశ్రయం చేరుకున్నారు. తర్వాత చార్లీ తల్లి మానసిక అనారోగ్యానికి గురై పిచ్చానుపత్రిలో చేరింది. ఆ తర్వాత కోర్టు ఆదేశాల ప్రకారం సిడ్నీని, చార్లీని వారి తండ్రి పోషణలో వదిలిపెట్టారు. చార్లీ తండ్రి రోజూ తప్ప తాగుతూ యింకొక భార్య, కొడుకుతో అప్పటికే జీవితాన్ని భారంగా నెట్టుకొస్తున్నాడు. నటునిగా కొద్దిగా సంపాదించి, పారశాలలోనే చాలావరకు ఖర్చు పెట్టే వాడు ఎక్కువ కాలం ఆ మధ్యశాలలోనే

మత్తులో గడిపేవాడు. అటువంటి ఇంటికి సిడ్నీ, చార్లీ చేరుకున్నారు. సవతి తల్లి సరిగా చూచేది కాదు. సిడ్నీని యిబ్బంది పెట్టి బయటకు నడవమనేది. తండ్రి పట్టించుకునే వాడు కాదు. ఒక్కొక్కసారి సవతి తల్లి యిద్దరినీ యింట్లోకి రానిచ్చేది కాదు. ఒక రోజు రాత్రంతా భయంకరమైన చలిలో బయటే గడిపేవారు. భార్యాభర్తల మధ్య తగాదాలు జరుగుతూండేవి.

ఆ తర్వాత కొద్ది రోజులకే చార్లీ తల్లి కోలుకొని, ఆస్పత్రి నుండి విడుదలై పిల్లలిద్దరినీ తన భర్త సంరక్షణ నుండి తీసుకొచ్చింది. చిన్న గది ఒకటి తీసికొని ముగ్గురూ మళ్ళీ జీవితాన్ని ప్రారంభించారు. తండ్రి వారం వారం పంపే పది షిల్లింగులు, తల్లి కుట్టు పనితో సంపాదించినది వారి ఆదాయం ఎంత దారిద్ర్యంలో నున్నా, నీచత్వంతో సంబంధం లేకుండా ఎంతో జాగ్రత్తగా యిద్దరు పిల్లలను చాలా కష్టపడి పెంచింది.

ఆమె తన నటనా జీవితాన్ని గురించి, నటన గురించి కొడుకులకు వివరించి చెప్తూ ప్రదర్శించి చూపెట్టేది క్రీస్తు గురించి అతని త్యాగాల్ని, కష్టాల్ని-గురించి చెప్పేది. జీవించి, జీవితాన్ని గురించి తెల్సుకోవాలి అని బోధించేది. సాహిత్యం ద్వారా కళల ద్వారా ఏమి సాధించవచ్చునో తెలిపేది. ఆ విధంగా చార్లీ మనసులో కళా జ్ఞాన జ్యోతిని వెలిగించింది. ప్రేమ, కరుణ, మానవత కళల ద్వారా సాధించవచ్చునని ఆమెనుండే తెల్సుకున్నానని చార్లీ తన ఆత్మకథలో చెబుతాడు.

మిక్కిలి దారిద్ర్యంతో గడుపుతున్న రోజుల్లో జరిగిన ఒక విచిత్ర సంఘటన చార్లీ చాప్లిన్ జీవితంలో పెద్ద మలుపుకు కారణం అయింది. ఈ విషయము ఆయనే చెప్పాడు. వారున్న వీధి చివర ఒక వధ్యశాల ఉండేది. అక్కడికి రోజూ గొర్రెలను తోలుకుపోయి వాటిని వధించేవాళ్ళు. ఒక రోజు ఒక చిన్న గొర్రెపిల్ల వధ్యశాలనుండి తప్పించుకు పారిపోయింది. అది పట్టుకోవడానికి దొరకకుండా నానా యిబ్బందులు పెట్టిన తంతు అందరికీ వినోదం కల్గించింది. వారికి దొరకకుండా తప్పించుకు పారిపోవాలని గొర్రెపిల్ల అరాటం. దాన్ని పట్టుకుపోయి చంపాలని వారి ప్రయత్నం. చార్లీకి తంతు బలే వినోదాన్ని కలిగించింది. కాని చివరికి ఆ గొర్రెపిల్ల పట్టుబడగానే, అది అరుస్తూ వుంటే దాన్ని పట్టుకుపోయి చంపుతారన్న ఊహ రాగానే పెద్దగా ఏడ్చుకుంటూ తల్లి దగ్గరికి పోయి 'వాళ్ళు దాన్ని చంపేస్తున్నారు. వాళ్ళు దాన్ని చంపేస్తున్నారు' అని ఆమె మీదపడి ఏడ్చాడు. ఆ రోజు జరిగిన సంఘటనలో వినోదాన్ని కలిగించిన సన్నివేశం

విషాదంగా మారిన స్థితి మనస్సులో తిరుగుతూ తర్వాత ఎన్నో రోజుల వరకు అతన్ని వెంటాడుతూనే ఉన్నాయి. ఆ వినోద విషాద సంఘటనలే భవిష్యత్తులో హాస్యకరుణతో కూడిన చిత్రాలకు పునాది అవుతుందని ఆరోజు భావించక పోవటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుందని చార్లీ చాప్లిన్ ఆత్మకథలో పేర్కొన్నాడు

అతడు స్కూల్లో చరిత్ర, సైన్సు, గణితం కవిత్వం చదివాడు కాని చార్లీకి ఏ విషయం కూడా నచ్చలేదు. తల్లి దగ్గర నేర్చుకున్న నటనలో ఆసక్తి చూపెట్టేవాడు. నటనలో నేర్పు చూపగలడనీ, మెలుకువలు తెలుసుకోగలడనీ తల్లి అతనికి చెప్తూండేది. అయితే స్కూల్ నాటకంలో తనకు పాత్ర యివ్వలేదనీ, ఇచ్చివుంటే అందరికంటే బాగా నటించేవాణ్ణని అనుకున్నాడు. ఆ తర్వాత తను పాడిన పాట విని, స్కూల్ వాళ్ళు తనతో అన్ని క్లాసుల్లో "మిస్ పార్సిల్లా పిల్లి" అనే పాటను అందరిముందూ పాడించటం, ఆ హాస్యపు పాట అందరికీ వినోదాన్ని కలిగించడం, అందరి మన్ననలను పొందటం ఒక విజయంగా భావించాడు. ఇంతవరకూ సిగ్గు బిడియంతో ఎవరికీ తెలియని చిన్న పిల్లాడు యిప్పుడు అందరికీ తెలిశాడు.

ఆ తర్వాత స్కూలు మానేసి క్లాగ్ డ్యాన్స్ ట్రూప్‌లో (Eight Lancashire Lads) చేరాడు. ట్రూప్ మేనేజర్ జాన్సన్, చార్లీ తల్లిదండ్రులకు పరిచయమున్నవాడు కాబట్టి నటించడం నేర్చుకుంటాడని, కొంత ఆదాయం కూడా వస్తుందనీ తల్లిని ఒప్పించాడు. అప్పటికి చార్లీకి పదేళ్ళ వయస్సు. డ్యాన్సు ట్రూప్‌తో తిరుగుతూ లండన్‌లో "సిండ్రిల్లా" లో పిల్లి వేషం వేసి అందరినీ వినోదంలో ముంచాడు. హాస్య పాత్రలు ధరించి, హాస్యగానిగా రాణించాలని చార్లీ కోరిక.

ఇంత చేసినా కుటుంబం చాలా దారిద్ర్యంతో బాధపడుతుండేది. ఇంట్లో వంట వుండేది కాదు. కొంత కాలం మిత్రులకు అతిధులుగా వుండేవారు. తర్వాత సిడ్నీకి టెలిగ్రాఫు శాఖలో పని దొరికింది. తల్లి తన కుట్టు పనిమీద కొంత సంపాదించేది. అయినా తిండికి సరిపోయేదికాదు. సరియైన అత్యవసరమైన కనీసం అవసరమైన బట్టలు కూడా ఉండేవి కావు. తన తండ్రి చివరి రోజులలో హాస్పిటల్‌లో చనిపోతే, అంత్యక్రియలకు డబ్బులేక మున్సిపాలిటీ వారికి శవాన్ని అప్పగించమన్నారు. కాని, ఆఫ్రికాలో ఉండే చార్లీ చిన్నాన్న ఆ రోజుల్లో లండన్‌లో ఉన్నందున ఖర్చులన్నీ ఆయనే భరించాడు. తండ్రి వారికి మిగిల్చింది ఒక పాత కోటూ, జేబులో దొరికిన ఒక క్రౌను నాణెం! అలా ఆయన తండ్రి నుండి శాశ్వతంగా దూరమైనాడు. తండ్రితో చార్లీకి సరిగా పరిచయం లేనట్లే.

ఈ కష్టకాలంలో చార్లీ తల్లిని బ్రతిమిలాడి ఒక షిల్లింగ్ అడుక్కొని పూల వ్యాపారం చేశాడు. ఒక రోజు ఐదు షిల్లింగులు సంపాదించాడు. చార్లీ మద్యశాలల్లో పూలు అమ్మటం అవమానంగా తోచి తల్లి ఆ పనిని మాన్పించింది. చార్లీ ఎప్పుడూ వ్యాపారం చేయాలని, ధనం సంపాదించాలని, ఎన్నో ఊహలు చేసేవాడు. ఎన్నో చిన్న చిన్న పనులు చేసేవాడు. కొన్నాళ్ళు పేపర్లు అమ్మాడు. దుకాణాలలో, డాక్టర్ల దగ్గర, ప్రింటింగ్ ప్రెస్‌లో, పుస్తకాల షాపులో, కట్టెల అడ్తీలో, వడ్రంగి దుకాణాలలో పని చేశాడు అయినా సంపాదించింది సరిపోక చాలా ఆందోళనకర పరిస్థితుల్లో వుండేవాడు. ఒకసారి పాత బట్టలు పట్టుకుపోయి బజారులో కేకలు వేస్తూ అమ్మి ఆరు పెన్నీలు తెచ్చాడు. కొన్ని వారాలు తన తాతమీద ఆధారపడ్డారు. దుర్భర దారిద్ర్యంలో కనీసం టీ త్రాగటానికి నోచుకోలేదు. గది అద్దె కట్టే పరిస్థితులు సరేసరి. సరిగా తిండిలేని, విశ్రాంతి ఎరగని తల్లి మానసిక అనారోగ్యానికి గురైంది. అందువల్ల మళ్ళీ పిచ్చాసుపత్రిలో చేర్చారు ఆమె దాదాపు పదేళ్ళపాటు అనారోగ్యంతో, హాస్పిటల్లో వుంది చార్లీ ఒంటరి వాడయ్యాడు. సిడ్నీ ఎక్కడో నౌకరీ చేస్తున్నాడు. చార్లీ మానసికంగానూ, భౌతికంగానూ యిలా ఒంటరిగా జీవితాంతం ఉంటూనే వచ్చాడు

ఒంటరియైన చార్లీ ఎన్నో చిన్న చిన్న పనులుచేస్తూ, పస్తులుంటూ, అర్థాకలితో, నాటకాల కంపెనీలకు వెళ్ళి బాలుర వేషాలకై అర్థించాడు. చార్లీకి ఎప్పుడూ నటుడు కావాలనే వుండేది. నెల రోజుల తరువాత బ్లాక్ మోర్ నాటక కంపెనీ వాళ్ళు " షెర్‌లాక్ హోమ్స్" **లో** "బిల్లీ" గా వేయాలని అడిగారు. అప్పటికి చార్లీకి 12 సంవత్సరాల వయస్సు. చాలా చిన్నగా వుండేవాడు. వయస్సు 14 అని అబద్ధం చెప్పాడు. "షెర్‌లాక్ **హోమ్స్**" లో 40 వారాలపాటు నటించటానికి ఒప్పుకున్నాడు. వారానికి 2 పౌండ్ల 10 షిల్లింగులు జీతం. ఇది చాలా అదృష్టంగా, జీవితానికి ఒక మలుపుగా భావించాడు చార్లీ "జిమ్" అనే నాటకంలో కూడా వేషానికి ఒప్పుకున్నాడు. నాటకాలు వేస్తూ ఊరూరా తిరిగేవాడు తర్వాత తన అన్న సిడ్నీకి కూడా వేషాలు యిప్పించాడు. ఆస్పత్రిలో వున్న తల్లికి ఉత్తరాలు వ్రాస్తుండేవారు. తల్లి ఆరోగ్యం బాగుపడిన తర్వాత మంచి యింట్లో కొంతకాలం కలిసి వున్నారు. నాటకాల కంపెనీల ఒప్పందం తీరిన తర్వాత మళ్ళీ కొంతకాలం పనిలేకుండా వుండటంతో వున్న సంపాదనంతా ఖర్చయిపోయింది.

తరువాత ఒక సర్కస్ కంపెనీలో చేరాడు. అన్న వేరే నాటకాలలో వేషాలు

వేస్తుండేవాడు. సర్కస్ వదలి వేరే నాటకాలలో వేషాలు వేశాడు బాల్యదశ నుండి యవ్వన దశలోకి అడుగిడుతున్న చార్లీకి నాటకాలు వేయాలనీ, నటుడు కావాలనీ, నటన వృత్తిగా జీవనాధారంగా చేసుకోవాలనే తప్ప, నటన, నాటకం, కళ పట్ల ఏ ఆలోచన లేదు. 17వ సంవత్సరంలో ఒక నాటకంలో నాయకుని పాత్ర (Hero) ధరిస్తాడు. అప్పటి నుండి నాయక పాత్రలనే వేయాలనుకునేవాడు.

చార్లీ ఒక చిన్న వినోద నాటకాన్ని వ్రాశాడు. ఆ నాటకాన్ని చార్‌కోట్ అనే ఆయనకు మూడు పౌండ్లకు అమ్మాడు. ఆ తర్వాత కొంతకాలం ఏ పని చేసినా కలసి రాలేదు. కొన్నాళ్ళకు 'ఫుట్‌బాల్ మ్యాచ్' అనే నాటకంలో వేషం దొరికింది. ప్రేక్షకులందరినీ నవ్వించాడు. నాటకం విజయవంతం కావడంతో ఒక సంవత్సరానికి కార్నో కంపెనీతో కాంట్రాక్టులు ఒప్పుకున్నాడు. అన్న సిడ్నీ, తనూ కలసి 40 పౌండ్ల అద్దెతో ఒక మాంచి యిల్లు తీసుకున్నారు. తరువాత ఒక అందమైన నటి హెట్టీకెల్లీతో ప్రేమ, పెళ్ళి సంభాషణల దాకా వెళ్ళింది. ఆమె అంగీకరించలేదు, అయినా ఆమెను మనసులోనే నిలుపుకుంటాడు కొద్దికాలానికే ఆమె మరణించింది. అలా చార్లీ మొదటి ప్రేమ వ్యవహారం అసంతృప్తిగా ముగిసింది.

1909 లో నాటకాలు వేయటానికి పారిస్ నగరానికి వెళ్ళాడు. వారానికి ఆరు పౌండ్ల సంపాదనతో ఎందరితోనో పరిచయాలు జరిగాయి. ఒక నెల తర్వాత మళ్ళీ లండన్‌లో నాటకాలు వేయడమూ కొన్ని అపజయాలు లభించాయి అందుకని అమెరికా పోవాలని ఆలోచన వచ్చింది. ఆల్ఫ్రీన్స్ అమెరికాలో కార్నో కంపెనీ మేనేజరు, ఒక హాస్యగాని కోసమై లండన్‌లో వెతుకుతూ వెతుకుతూ, ఒక నాటకంలో చార్లీ నటనను చూచి మెచ్చుకొని తనతో అమెరికా రమ్మనడం జరిగింది.

## చార్లీ అమెరికా ప్రయాణం

1910లో 12 రోజుల సముద్ర ప్రయాణం తర్వాత కెనడా మీదుగా అమెరికా చేరాడు చార్లీ. న్యూయార్కు నగరానికి రాగానే సాహసం, వేగంతో, ఎత్తైన భవనాలతో అంతా కొత్తగా కనపడింది. నాటకాలలో తన పాత్రలతో అక్కడి ప్రేక్షకులను మొదటి రోజుల్లో ఆకర్షించలేకపోయాడు. అలా జరగడం తన లోపంకాదనీ నాటకాల్లో వున్న పాత్ర రచన వల్లనేనని చార్లీ అభిప్రాయం. పగలంతా విసుగుతో పిచ్చిపిచ్చిగా న్యూయార్కు అంతా తిరిగేవాడు. ఏమాత్రం నిరాశ చెందక అమెరికాలోనే

స్థిరపడిపోవాలని అనుకుంటాడు. విజ్ఞానాభివృద్ధి కొరకై సెకండ్ హేండ్ పుస్తకాలు కొని చదువుతుండేవాడు. ఆరువారాల అమెరికా పర్యటన తర్వాత, నాటకాలు విజయవంతంకాక, ఇంగ్లాండుకు మూటాముల్లే సర్దుకునే ప్రయత్నంలో ఉంటాడు. ఒక రోజు నాటకంలో అనుకోకుండా ఇంగ్లీషువాళ్ళు ఎక్కువమంది ప్రేక్షకులుగా వున్నందున వారు పగలబడి నవ్వుతూ నాటకాన్ని మెచ్చుకుంటారు. అదే వారంలో ఒక నాటక కంపెనీ ఇరవై వారాల కాంట్రాక్టుమీద చార్లీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఆవిధంగా అమెరికాలోని కొన్ని ప్రాంతాల పర్యటన జరిగింది సంగీతంలో కూడా ప్రవేశాన్ని సంపాదించాలని అభ్యాసం చేస్తూ సంగీతంలో ప్రావీణ్యాన్ని గడించలేనని తెలుసుకున్న తర్వాత అభ్యసించడం మానేశాడు. వేరొక కంపెనీ వారు మరొక ఆరువారాలపాటు కాంట్రాక్టు యివ్వటంతో చికాగోలోని వివిధ ప్రాంతాలను పర్యటిస్తాడు. నాటకాలు విజయవంతంగా నడచిన తర్వాత మళ్ళా 20 వారాలకు ఇంతకుముందు కంపెనీవాళ్ళే కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. ఈ పర్యటనలో రాబర్ట్ ఇంగన్‌సోల్ "వ్యాసాలు, ఉపన్యాసాలు" చదివి తాను నాస్తికుడని తెలుసుకున్నాడు. ఎమర్సన్ "స్వశక్తి" వాల్ట్ విట్‌మెన్ గ్రంధాలు, యింకా పలువురి గ్రంధాలు, చదివి ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు.

ఫిలడల్ఫియాలో వుండగా న్యూయార్కు నుండి తన నాటక కంపెనీకి ఒక టెలిగ్రాం వచ్చింది దాంట్లో మీ కంపెనీలో ఎవరైన చాపిన్ అనే వ్యక్తి వుంటే న్యూయార్కు పంపమని, కాసెల్, బామన్ అనే వారిని కలుసుకోమని వుంది. చాపిన్ అనేవారు ఎవరూ లేనందున చాప్లిన్ తననే అనుకొని న్యూయార్కు బయలుదేరాడు. కాసెల్, బామన్‌లు ఎవరో తెలియదు. న్యూయార్కు వచ్చి వారిని కలిసి ఆశ్చర్యపోయాడు చార్లెస్. కాసెల్ కీస్టోన్ సినిమా కంపెనీ అధిపతి. మాక్ సెన్నెట్ అనే దర్శకుడు చార్లీ తాగుబోతుగా ఒక నాటకంలో నటించడంచూచి సినిమాలో వేషం వేయటానికై పిలిపించాడు. కీస్టోన్ కంపెనీలో ఫోర్డ్ స్టెర్లింగ్ (ప్రసిద్ధ హాస్యగాడు) స్థానంలో వేషం వేయవలసిందని అడిగాడు. మాక్ సెన్నెట్ తర్వాత అమెరికా సినిమా హాస్య వినోద పితామహుడుగా ప్రసిద్ధికెక్కాడు అప్పట్లో కీస్టోన్ కంపెనీ హాస్య సినిమాలు సరిగా లేకపోయినా, నాయిక పాత్ర ధరించే అందమైన నటి కుమారి మేబెల్ నార్మండి వల్ల వాళ్ళకు చాలా ప్రచారం వుంది.

అంతకు ముందే చార్లీ సినిమాలు తీయాలని వుబలాటపడుతుండేవాడు కాని ధైర్యం చాలక ఆ ప్రయత్నాల జోలికి పోలేదు. ఈ కొత్త అవకాశాన్ని, కొత్త జీవితాన్ని ఆహ్వానిస్తూ వారానికి మూడు సినిమాలలో నటించటానికి 150 డాలర్ల

జీతంతో ఒప్పుకున్నాడు అప్పుడు పనిచేస్తున్న కార్నో నాటక కంపెనీ జీతంకన్నా రెట్టింపు. ఇంకా కొన్ని నాటకాలు విజయవంతంగా ఆడిన తర్వాత ఇంగ్లాండు నుండి వచ్చిన నాటక కంపెనీ మిత్రులు ఇంగ్లాండు తిరిగి వెళ్ళి పోగా చార్లీ ఒక్కడే లాస్ ఏంజలిస్‌లో వుండిపోయాడు.

## చాప్లిన్ సినీరంగ ప్రవేశం

చార్లీ తన సినీ జీవితాన్ని అమెరికాలో ఒంటరిగా ప్రారంభించబోతున్నాడు. లాస్ ఏంజలిస్‌కు వచ్చిన నాటి రాత్రే సాన్నెట్‌ను, మెబెల్ నార్మండీను ఒక సినిమాహాలులో కలిశాడు. మరునటి రోజు స్టూడియోకివచ్చి అందరితో పరిచయాలేర్పరచుకోమని సాన్నెట్ చెప్తాడు. మరునాడు స్టూడియోకి వెళ్ళగా ఎవరూ తనని పలకరించకపోవటంతో స్టూడియో బయట కూడా ఎవరూ కనపడకపోవటంతో సిగ్గు, బిడియంతో తిరిగి హోటల్ గదికి చేర్తాడు. ఈవిధంగా రెండురోజులు స్టూడియోకి పోవటం, ఎవరినీ కలవటానికి ధైర్యం చాలకపోవటం, తిరిగి గదికి రావటం జరిగింది. మూడవ రోజున సాన్నెట్ నుండి ఫోను వచ్చింది. రెండు రోజులు ఎందుకు రాలేదని ప్రశ్న - ఏదో సాకు చెప్పాడు. మూడవ రోజు తప్పక రావల్సిందనీ, ఎదురు చూస్తుంటామని చెప్పటంతో ధైర్యంగా స్టూడియోకి వెళ్ళి అక్కడ అందరితో పరిచయాలు చేసుకున్నాడు నటీనటులు, స్టూడియో పరిసరాలు, వాతావరణం, సినిమా షూటింగ్ పద్ధతులు అర్ధంచేసుకోవటానికి ప్రయత్నం చేశాడు.

కీస్టోన్ స్టూడియోలో అప్పటికే ప్రసిద్ధ హాస్యనటుడయిన ఫోర్డు స్టెర్లింగ్‌తో పరిచయం అయింది చార్లీ అతని స్థానే తన పాత్రను వహించాలి. ఆ రోజులలో నటీనటులు ప్రసిద్ధ నటులను అనుకరించడం తప్ప, వారి ప్రత్యేకతని నూతనత్వాన్నీ చూపటం లేదని తెలుసుకున్నాడు. చార్లీకి ఎవరినీ అనుకరించడం ఇష్టం లేదు. తన ప్రత్యేకత వేరే కనుక ఫోర్డ్ స్టెర్లింగ్ స్థానంలో తాను సరిపోననుకున్నాడు. తొమ్మిది రోజులపాటు రోజూ స్టూడియోకి పోవటం సినిమాలు ఎలా తీస్తున్నారో చూడటం జరిగింది తప్ప తనకేమీ పని యివ్వలేదు

చివరికి ఒక సినిమాలో వార్తా పత్రికల రిపోర్టర్‌గా నటించమన్నారు. అదే చార్లీ మొదటి చిత్రం. అది ప్రింటింగ్ ప్రెస్‌ను గురించి డాక్యుమెంటరీ. కథలేదు. డైరెక్టర్‌కు కొన్ని సలహాలిస్తే కోపంవచ్చి చెప్పినట్లు చెయ్యమన్నాడు. తనకేమీ తృప్తి కలగలేదు. అది తన మొదటి సినిమా అనుభవం. ఆ రోజుల్లో చిత్రం తీయటానికి ఒక పద్ధతి అంటూ ఏమీ లేదు. అన్నీ ఒక రీల్, రెండు రీళ్ళ మూకీలే.

చిత్రం పది పదిహేను నిమిషాలపాటు ప్రదర్శించబడేది చాలావరకు హాస్యచిత్రాలే. ఒక కథంటూ, మాటలంటూ లేవు. ఎక్కువగా ఒకరినొకరు అనుకరించడం, అంతా విచిత్రంగా కన్పించింది చార్లీకి.

ఆ తర్వాత ఒకరోజు మాక్‌సెన్నెట్ ఏదో చిత్రం తీస్తూ, ఒక సన్నివేశంలో హాస్యం కురిపించటానికి పాత్ర కావలసి, చాప్లిన్‌ను పిలిచి, నవ్వుల పువ్వులు కురుపించటానికి హాస్యగాని వేషం నీ యిష్టం వచ్చినట్లు వేసుకొని త్వరగా రమ్మంటాడు. చార్లీకి మేకప్ ఎలా వేసుకోవాలో తెలియక డ్రస్సింగ్ రూములోకి పోతుండగానే ప్రతి దాంట్లో వైవిధ్యం కనపడాలనుకున్నాడు. వదులు ప్యాంట్లు, పెద్దబూట్లు, చేతికర్ర, డెర్బీహాట్ పెట్టుకొని వేషం వేసుకోవాలనుకున్నాడు. ప్యాంట్లు వదులొదులు, బిర్రుకోటు, చిన్నహాట్, పొడుగు బూట్లు, వయస్సు పెద్దగా, చిన్నగా కాకుండా కనపడటానికై చిన్ని మీసం పెట్టుకొని వేషం వేసుకున్నాడు ఆ పాత్ర ఎటువంటిదో ఆయనకు తెలియదు. కాని మేకప్ పూర్తి అయిన తర్వాత ఆ వేషంలో పాత్ర తనదే (చాప్లిన్) ననిపించిందట! (తాను చార్లీ అని తన పాత్ర చాప్లిన్ అని కొందరు విమర్శకులు వ్రాశారు. అందుకనే ఆ రెండు పేర్లు అలా అర్థం వచ్చేటట్లు కూడా ఈ రచనలో వ్రాశాను) తనను గురించి తన పాత్రను గురించి ప్రారంభించి, ఆ మేకప్‌లో స్టేజీమీదకి పోవటంతోనే తనను తానుగా (చార్లీ చాప్లిన్) పూర్తిగా జన్మించానని భావించాడు చేతిలో వున్న వంకెకర్ర త్రిప్పుకుంటూ మాక్ సెన్నెట్ ఇంకా ఇతరుల ముందుకు పోయినపుడు హాస్య భావాలు కొంటె వూహలు మనస్సులో పరుగెత్తటం మొదలుపెట్టాయి. అందరూ తన వేషం చూసి విరగబడినవ్వారు. అ పాత్రను ఆయన "ట్రాంప్" (Tramp) అని పిల్చాడు. (చార్లట్ అని కూడా తర్వాత రోజుల్లో కొందరన్నారు.) ఆ పాత్ర యొక్క విశిష్టత ఏమిటో చార్లీ పేర్కొన్నాడు.

'వీడొక బహుముఖ వ్యక్తి. దేశ దిమ్మరి, తిరుగుబోతు, పెద్దమనిషి, కవి, స్వాప్నికుడు, ఒంటరివాడు, ఎప్పుడూ ప్రేమనూ, సాహసాలను ఆశించేవాడు. కావాలంటే ఒక శాస్త్రవేత్తగా, ఒక సంగీతజ్ఞానిగా, ఒక ప్రభువుగా, పోలో ఆటగాడుగా ఎవరినైనా నమ్మించగలడు. అయితే సిగరెట్ పీకలు ఏరుకునే వానికంటే, పాపల చేతులలో తాయిలాలు ఎత్తుకుపోయే వాళ్ళకంటె గొప్ప వాడు కాదు. సందర్భం వస్తే ఒక ఆడదాన్ని ఎగిరి తన్నగలడు కూడా! బాగా కోపంలో వున్నపుడు మాత్రమే!"

మాక్ సెన్నెట్ తదితరులు యికిలిస్తూ వుండగా తన ట్రాంప్ పాత్రను గురించి వారికి పదినిమిషాల సేపు అనర్గళంగా ప్రసంగిస్తాడు అలా 1913 లో అకస్మాత్తుగా అనాలోచితంగా ట్రాంప్ పాత్ర సృష్టి జరిగింది ఇదే పాత్రలో ఇంచుమించు అర్ధశతాబ్దంబాటు దాదాపు వంద చిత్రాలలో వివిధ రకాలైన నూరు పాత్రలను ధరించి విజయవంతంగా నటించి, ప్రపంచ ప్రేక్షకులకు మహాభిమాన పాత్రుడయ్యాడు. ఈ ట్రాంప్ పాత్రను గురించి తరువాత పేజీలలో సందర్భం వచ్చినప్పుడల్లా వివరిస్తాను.

తన ట్రాంప్ వేషంతో మొట్టమొదటి సినిమా మాక్ సెన్నెట్ దర్శకత్వంలో నటించాడు. షూటింగ్ నడుస్తూ ఉంటుంది, కథ ఏమిటో తెలియదు. ఎన్నో చిలిపి పనులు చేస్తూ, కొంటె వేషాలు వేస్తూ, అమాయకంగా కెమెరా ముందు నటిస్తుంటే, కెమెరా వెనుక వున్న వాళ్ళు విరగబడి నవ్వేరు. అక్కడకు పెద్ద గుంపు చేరింది. స్టూడియోలోని అన్ని విభాగాల వాళ్ళు, వేరే యితర స్టూడియోల్లో పనిచేసే వాళ్ళు, అక్కడకు చేరి చాప్లిన్ వేషాన్ని నటనను చూచి పగలబడి నవ్వారు. అక్కడే వున్న ఫోర్డు స్టెర్లింగ్ అందరినీ నెట్టుకుంటూ వచ్చి చాప్లిన్‌ను మెచ్చుకుంటాడు. ఆవిధంగా చార్లీ చాప్లిన్ సినీ జీవితం సహజమైన హస్యపాత్ర సృష్టితో ఆకర్షణీయంగా ప్రారంభమయింది. ఆ రోజుల్లో సాధారణంగా 10 అడుగుల నిడివిగల చిత్రాలను తీసేవారు. అయితే చాప్లిన్ నటన బాగా ఉందని 75 అడుగుల వరకు చిత్రాన్ని పొడిగించారు దానితో అదే వేషంలో తన పాత్రలన్నింటినీ నిర్వహించాలనుకొన్నాడు.

తన వేషాన్ని గురించి చెప్తుతూ, తన పాత్ర అసాధారణమైందనీ, ప్రత్యేకత గలదనీ, అమెరికా ప్రేక్షకులకు తెలియనిదనీ, తనకు కూడా తెలియదనీ, కాని ఆ దుస్తుల్లో జీవంగల ఒక వాస్తవ వ్యక్తి వున్నాడనీ, ఎన్నో భావాలు తనకు కలగటం, దుస్తులు ధరించేవరకూ ఒక ట్రాంపుగా వుండాలని తాను కలలో కూడా అనుకోలేదు అంటాడు చార్లీ.

మాక్ సెన్నెట్ చాలా మంచి డైరెక్టరే కాక మంచి వ్యక్తి కావటం వల్ల, చార్లీ యిచ్చే సలహాలను ఆమోదించేవాడు. దానివల్ల చార్లీకి ధైర్యం, ప్రోత్సాహం లభించింది. తనలో ఉన్న సృజనాత్మక శక్తి వికసించింది. తన పాత్రకు కావలసిన కథా నిర్మాణం తానే చేసుకోగలనని భావిస్తాడు. ఈ విశ్వాసానికి సెన్నెట్ ప్రోత్సాహం కూడా వుంది.

తర్వాత తీసిన చిత్రానికి దర్శకుడైన లెహర్మన్‌కు చార్లీకి మధ్య హాస్యం మీద అభిప్రాయ భేదాలు వచ్చాయి. లెహర్మన్ చార్లీ యిచ్చిన సలహాలు వినక తాను చెప్పినట్లు చేయమనేవాడు దానికి చార్లీ ఒప్పుకునేవాడుకాడు. ఆ తర్వాత కూడా డైరెక్టర్లతో పడేదికాదు చార్లీతో పనిచేయటం, పనిచేయించుకోవటం కష్టమని అందరూ అనుకునేవారు. ఐదు సినిమాల్లో నటించాక తానే ఒక కథవ్రాసి, స్వీయ దర్శకత్వంలో చిత్రాన్ని తీయాలనుకుంటాడు. సెన్నెట్‌తో సంప్రదిస్తే, ఆయన అంగీకరిస్తాడు కాని కుమారి మెబెల్ నార్మండీ దర్శకత్వంలో ఒక చిత్రంలో నటించమంటాడు ఆమెకు దర్శకత్వం రాదని ఇతడూ, తాను చెప్పినట్లు చేయాలని ఆమె, ఈవిధంగా ఇదివరకే అభిప్రాయభేదాలు ఏర్పడినాయి. సెన్నెట్ మధ్యవర్తిత్వంతో తగాదాలు సమసిపోతాయి

ఇంతలో న్యూయార్క్ నుండి చాప్లిన్ సినిమాలకు చాలా గిరాకీ వుందనీ వెంటనే చాప్లిన్ చిత్రాలు ఎక్కువగా తీయండని టెలిగ్రాంలు. అప్పటి డైరెక్టర్లకు చిత్రాలు తీయడం, కెమెరాలను సరిగా వుపయోగించటం తెలియదనీ తాను యింకా బాగా తీయగలననీ ధైర్యంతో ముందుకు వచ్చి సెన్నెట్‌ను ఒప్పించి, తన స్వంత చిత్రాన్ని డైరెక్టు చేయడం ప్రారంభిస్తాడు. అది "Caught in the Rain" (కాట్ ఇన్ ది రేయిన్). ఆ చిత్రం విజయవంతంగా నడిచింది. అప్పటి నుంచి తన చిత్రాలన్నిటికీ కథ తానే వ్రాసి, తీశాడు. దాంతో సెన్నెట్‌తో స్నేహం పెరుగుతుంది. సెన్నెట్ చార్లీకి చాలా ధైర్యాన్ని ప్రోత్సాహాన్ని ఇచ్చేవాడు. ఇప్పుడు ప్రేక్షకుల్లో చార్లీ మంచి పేరు సంపాదించుకున్నాడు. కీస్టోన్ స్టూడియోలో మాక్ సెన్నెట్ దర్శకత్వంలో ఎంతో నేర్చుకుని, అందరి మన్ననలను పొంది, అందరికీ స్నేహితుడుగా "చార్లీ" గా పిలువబడేవాడు. 1914 లో కీస్టోన్ కంపెనీలో ఒకటి, రెండు రీళ్ళ 35 చిత్రాల్లో నటించాడు. అప్పటికి చార్లీ వయస్సు 25 సంవత్సరాలు, అమెరికాలో వున్న ప్రఖ్యాత సినీతారలతో, దర్శకులతో, స్టూడియోల అధిపతులతో పరిచయాలు, స్నేహాలు ఏర్పడినాయి.

తన అన్న సిడ్నీ అప్పటికి పెళ్లి చేసుకొని ఇంగ్లాండులోనే వున్నాడు. సిడ్నీని గురించి సెన్నెట్‌కు చెప్పి, వారానికి 2000 డాలర్ల ఒప్పందం పై అమెరికాకు రప్పించాడు. సిడ్నీ అమెరికా వచ్చినపుడు ఇంగ్లాండులో చాప్లిన్ చిత్రాలను గురించి, ప్రేక్షకుల ఉత్సాహాన్ని గురించి, తన పేరును గురించి చార్లీకి చెప్పాడు. సిడ్నీ కూడ ఆ తరువాత సినిమాల్లో పేరుతెచ్చుకున్నాడు.

కీస్టోన్ స్టూడియోలో, సెన్నెట్‌తో మళ్ళీ ఒక ఏడాది కాంట్రాక్టు వుండమంటే చార్లీ వారానికి వెయ్యి డాలర్లు యిస్తే వుంటానంటాడు వాళ్ళు యివ్వలేమంటారు అన్నతో కలిసి స్వంతంగా చిత్రాలు తీయాలనుకుంటాడు. కాని సిడ్నీకి ధైర్యం చాలలేదు

ఇంతలో ఒక రోజు బెన్‌రాబిన్స్ "ఎస్సనీ" (Essany) కంపెనీ ప్రతినిధిగా వచ్చి చాప్లిన్‌ను కలిసి వారానికి 1250 డాలర్ల జీతంమీద కాంట్రాక్టు కుదిరితే 10,000 డాలర్ల బోనసు ఇప్పిస్తానంటాడు చార్లీకి ఆశ్చర్యమూ, సంభ్రమమూ, దాంతో కీస్టోన్ కంపెనీ వదిలి, ఎస్సనీ కంపెనీలో జేరాడు వెంటనే పని మొదలు పెట్టి "His New Job" (హిజ్ న్యూ జాబ్) చిత్రాన్ని తీస్తాడు. కాని తనకివ్వవలసిన జీతం, రావలసిన బోనసు యివ్వలేదు ఇది వివాదానికి దారితీసి, అక్కడ పని మానుకుని బ్రాంకోబిల్లీ కంపెనీలో చేరాడు దాని యజమాని అండర్‌సన్ "వెస్టర్న్" చిత్రాలు తీస్తుండేవాడు చాప్లిన్ యిక్కడ "His Night out" (హిజ్ నైట్ అవుట్) అనే "త్రాగుబోతు ఆనందాలు" తో పాటు నాలుగు చిత్రాలు తీస్తాడు అక్కడ స్టూడియోలో సరైన వసతులు లేక స్థిరపడలేకపోయాడు అందుకని లాస్ ఏంజిలిస్ పోయి చిన్న స్టూడియోని అద్దెకు తీసుకున్నాడు. ఆ రోజుల్లో చాప్లిన్ సినిమాలకు రద్దీ బాగా ఎక్కువయింది రెండు రీళ్ళ చిత్రం వేయటానికి సినిమాహాలు వాళ్లు ఆటకు 50 డాలర్లు అద్దె యిచ్చుకునేవారు.

ఒక రోజు సాయంత్రం న్యూయార్క్ నుండి ఒక టెలిగ్రాం - రెండు వారాలపాటు ప్రతి సాయంత్రం కెమెరా ముందు చాప్లిన్ 15 నిమిషాలు నిలబడితే 25,000 డాలర్లు ఇస్తామని వార్త! అండర్‌సన్‌కి టెలిఫోన్ చేసి రెండు వారాల పాటు సెలవు యిమ్మంటే, రెండు వారాలలో తన కంపెనీలోనే రెండు సినిమాలు తీస్తే 25,000 డాలర్లు తానే యిస్తానని టెలిఫోన్‌లో చెప్పి మరునాడు 25,000 డాలర్లకు చెక్కు పంపిస్తాడు. ఇది చాలా అదృష్టంగా భావించాడు చాప్లిన్.

సిడ్నీ, చార్లీతో వుంటూ, తమ్ముని వ్యాపారం చూచేవాడు చిత్రాలు పిచ్చిపిచ్చిగా నడుస్తున్నాయ్. సినిమా హాళ్ళ ముందు పెద్ద పెద్ద క్యూలు న్యూయార్క్‌లో చాప్లిన్ పాత్రలను పిల్లల ఆట బొమ్మలుగా, శిల్పాలుగా అన్ని మందుల షాపులలోనూ, యితర దుకాణాలలోను అమ్మేవారు. తన వేషం వేసుకొని జిగ్‌ఫెల్డ్ పోలీసు బాలికలు "Those Charlie Chaplin Feet" (చార్లీ చాప్లిన్ పాదాలు) అనే పాటను పాడుతూ వినోదం కలిగించేవారట. పుస్తకాల వాళ్ళు, బట్టల వర్తకులు, బొమ్మలమ్మే వాళ్లు, సిగరెట్ల కంపెనీలు, టూత్‌పేస్ట్, కొవ్వొత్తులు, అనేక రకాల

వ్యాపారులు చాప్లిన్ పేరును, పాత్రని వాళ్ల వ్యాపారాభివృద్ధికి వినియోగించుకోవడం మొదలు పెట్టారు. అభిమానుల ఉత్తరాలు కట్టలుకట్టలుగా పెరుగుతూంటే వాటన్నిటికీ సిడ్నీతో జవాబులు వ్రాయించేవాడు.

చాప్లిన్ చిత్రాలకు డిమాండ్ బాగా పెరిగిపోయింది. అందుకని, సిడ్నీ సలహాపై సినిమా హాళ్లలో సీట్ల సంఖ్యను బట్టి రేట్లు పెంచగా, చాప్లిన్ సినిమాలు చాలా లాభాలు గడించాయి. ఎస్సనీ కంపెనీ ఏజెంటు వచ్చి ఒక్కొక్క చిత్రానికి చాప్లిన్‌కి పదివేల డాలర్లు బోనసుగా యిస్తానన్నాడు. చార్లీ అంగీకరించలేదు. మళ్లా వచ్చి 12 రెండు రీళ్ళ చిత్రాలు తీసి యిస్తే మూడు వందల యాభై వేల డాలర్లు యిస్తానన్నాడు నూటయాభై వేల డాలర్లు బోనసు ముందుగా యిస్తే తీసిస్తానంటాడు చాప్లిన్ ఒప్పందం కుదరలేదు. ఈ దశలో ఎక్కడ చూచినా చాప్లిన్‌కి బ్రహ్మాండమైన భవిష్యత్తు కనబడింది. ఈ ఉజ్వల భవిష్యత్తు ఎక్కడికి దారితీస్తుందో చాప్లిన్‌కి తెలియదు తుఫానులాగ విజయపరంపర, విపరీతమైన పిచ్చి డబ్బు, సంభ్రమాన్ని, ఆశ్చర్యాన్ని, భీతిని కలిగించేవి. మిత్రులు ఎన్నో వ్యాపారాలలో పెట్టుబడులు పెట్టమనేవారు కాని ఏ వ్యాపారం జోలికి పోదల్చుకోలేదు అట్లా చేసినట్టయితే కోట్లు సంపాదించేవాడిననీ, అక్కడక్కడ తన స్వీయ చరిత్రలో అభిప్రాయపడ్డాడు.

చార్లీ చాప్లిన్ తనకు తెలియకుండానే ప్రజల అభిమాని అయిపోయాడు. ఒకసారి న్యూయార్క్‌కు ఐదు రోజుల ప్రయాణంలో ఆయనకు తెలియకుండానే ప్రతిరైలు స్టేషన్‌లో వేలాదిమంది అభిమానులు, సన్మానాలు. రైలు ప్రయాణంలో వుండగా ప్రతి పట్టణం నుండి ఎన్నో టెలిగ్రాంలు మా నగరంలో ఒక పూట వుండి ఆతిధ్యం స్వీకరించమనీ, సన్మానాలు చేస్తామనీ పెద్ద పెద్ద వ్యాపారుల కోర్కెలు. చాప్లిన్‌కి ప్రేక్షకులంటే అభిమానమున్నా సన్మానాల తంతు అంటే యిష్టముండేది కాదు. బలవంతంగా అంగీకరించేవాడు. పెద్ద పెద్ద పోలీసు బందోబస్తుల మధ్య ఎంత రహస్యంగా ప్రయాణం చేసినా, పత్రికల వాళ్ళు, అభిమానులు వూరుకునేవారుకారు వారు అల్లరి చేయకుండా వుండటం కోసం పోలీసులు చాప్లిన్‌ను ఫలానా స్టేషన్‌లో దిగమని ప్రాధేయపడవలసి వచ్చేది. ఎక్కడకుపోయినా గుంపులు గుంపులు, కోలాహలం (అదంతా వ్రాయాలంటే ఒక పెద్ద ప్రహసనం అవుతుంది. అందుకని అక్కడక్కడ సందర్భం వచ్చినప్పుడు వ్రాస్తాను.) అతనిపట్ల ప్రజల గౌరవాభిమానాలటువంటివి

ప్రజాభిమానం, గౌరవం, ధనం, విజయపరంపర, ఉజ్వల భవిష్యత్తు, ఎన్ని

ఉన్నా హామ్లెట్ మాదిరిగా చాప్లిన్ ఒంటరి వాడుగానే భావించేవాడు ఎందరికో తాను తెల్సినా, తనకెవరూ తెలియదనుకునేవాడు. గమ్యం ఏమిటో యెక్కడికి పోతున్నాడో తెలియదు ఒంటరిగా, పిచ్చివానిగా వీధుల వెంట తిరిగేవాడు. ఆవిధంగా న్యూయార్కులో రెండురోజులు ఒంటరిగా తిరిగి, హోటల్‌కు పోతే జనం గుర్తుపట్టి వెంటపడేవాళ్ళు! తప్పించుకుని తిరిగేవాడు. ఆ తర్వాత మ్యూచ్‌వల్ కంపెనీతో ఒప్పందం కుదిరింది. నూటయాభైవేల డాలర్ల చెక్కు అందుకుంటూ వుంటే పత్రికల వాళ్ళు ఫోటోలు తీశారు. ఈ వార్తతో ఆ సాయంత్రం టైమ్ స్క్వేర్‌లో జనం గుంపులు, వారి మధ్యన చాప్లిన్, టైమ్స్ భవనంమీద విద్యుత్ అక్షరాలతో చాప్లిన్ మ్యూచువల్ కంపెనీతో సంవత్సరానికి 6,70,000 డాలర్లకు ఒప్పందం కుదిరిందని వార్త, చాప్లిన్ ఆ వార్త చదివి తనను గురించి కాదు, ఇంకెవరిని గురించో అనుకున్నట్లు భావించాడు. నిర్లిప్తత ఆవహించి ఉత్సాహం నశించదనుకుంటాడు.

చాప్లిన్ ఒంటరితనంతో బాధపడేవాడనీ, బిడియస్తుడనీ ఇంతకు ముందే వ్రాశాను దేని మీద కూడా అభిరుచి లేకపోవటంతో ఎవరినీ అకర్షించలేక పోవటంతో విసుగుచెందేవాడు. మిత్రులుగా చేసుకోవటం కోసం కావలసిన యువకత్వం, ధనం, గౌరవం అన్ని హంగులూ వున్నా ఒంటరిగానే న్యూయార్కు నగర వీధులలో తిరిగేవాడు. ఇది కొంత బాధ కలిగించింది ఎన్నో విషయాలు ఎందరికో చెపుదామనుకున్నా, ఒక్కోసారి సరిగా చెప్పలేకపోయేవాడు. ఎందరితోనో పరిచయాలున్నా అవన్నీ మిత్రత్వానికీ, ఆత్మీయతకూ దారి తీయటానికి వీలు కల్పించేవి కావు.

న్యూయార్కు నుండి లాస్ ఏంజిలిస్ తిరిగివచ్చి అలెగ్జాండ్రియా హోటలులో దిగితే, అక్కడ కౌంటర్ క్లర్క్ ఒక వుత్తరాన్ని యిచ్చాడు అ ఉత్తరం ప్రసిద్ధ సినీతార కుమారి మాడేఫీలే నుండి వచ్చింది. పావ్‌లోవా అనే ఒక ప్రసిద్ధ బాలే నాట్య తారకు బుధవారంనాడు యిస్తున్న విందు సందర్భంలో చాప్లిన్‌కు అహ్వానం. మాడేఫీలేను అంతకుముందు ఎప్పుడూ కలువక పోయినా సౌందర్యవతియైన ప్రసిద్ధ తారతో విందుకు చాలా అనందపడ్డాడు. విందుకు ఒకరోజు ముందు చాప్లిన్ తన కార్యదర్శితో విందుకు ఎలా హాజరు కావాలో మాడేఫీలేను అడిగి తెలుసుకోమన్నాడు. టెలిఫోనులో మాడేఫీలేతో సంప్రదించిన మీదట మామూలుగా హాజరు కావచ్చని తెలుసుకొని, విందురోజు హాలీవుడ్ హోటల్‌కు చాప్లిన్ వెళ్ళగా ఫీలే సాదరంగా స్వాగతం పలికింది. పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ అరగంట

కాలం గడిపారు  అతిథులు ఎవరూ రాలేదు. కాసేపటికి  ఆమె డిన్నర్ చేద్దామా అని అడుగగా, వారిద్దరే భోజనాలు చేయటం చాప్లిన్‌కి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇంత అందమైన తారతో ఎదురెదురుగా కూర్చుని విందు చేయవలసిన కారణం ఏమై వుంటుంది?  అని చాప్లిన్ ఆలోచన, ఆమె ఏమీ పట్టనట్టు కూర్చుంది. అయినా కుతూహలం ఆపుకోలేక "ఒంటరిగా ఈ విధంగా విందు చేయటం చాలా గమ్మత్తుగా వుంది" అన్నాడు. ఆమె చిరునవ్వు రువ్వుతుంది. "భోజనం తర్వాత వినోదానికై ఏదైనా నైట్ క్లబ్‌కు వెళ్దా" మన్నాడు. ఆమె కొంచెం కంగారుపడుతూ "రేపు ఉదయాన్నే మాక్‌బెత్ చిత్రానికి రిహార్సల్స్ చేయాల్సి వుంది కనుక పడుకోవాలి, కుదరదు" అంటుంది.  చాప్లిన్ స్వాభిమానం కొంచెం దెబ్బతిన్నట్లుగా భావించాడు.  పూర్తిగా నిరుత్తరుడౌతాడు.  మాటలు లేకుండా మౌనంగా యిద్దరూ భోజనం చేశారు. ఇద్దరి మనసుల్లో ఏదో గడబిడ, పొరపాటు జరిగిందని తెలుసుకున్నారు. "ఈ సాయంత్రం మీకు ఆనందంగా, గడువలేదనుకుంటా" నని ఫీలే చాప్లిన్‌తో అంది. "అలా ఏమీ లేదు.  చాలా సంతోషంగా వుంది" చాప్లిన్ జవాబుకు సమాధానంగా "మూడు నెలల నాడు నేను మీ మిత్రురాలు పాప్‌లో నాకు విందు యిచ్చిననాడు మీరు న్యూయార్కులోనే ఉన్నారనుకున్నాను.  కాని మీరు ఆ విందులో లేకపోవటం విచారకరం అని చాప్లిన్‌తో మెల్లిగా అంటుంది. "క్షమించండి" అంటూ తొందరగా ఆమె పంపిన ఆహ్వానాన్ని తీసి మొదటిసారి తేదీ చూస్తాడు. ఆ తర్వాత "చూడండి,  మూడు నెలలు ఆలస్యంగా వచ్చాను" అంటూ ఇద్దరూ నవ్వుకుంటారు. ఇలా వుంటాయి వాస్తవ జీవితంలో మన చాప్లిన్ గాథలు. ఆ రోజుల్లో వ్యక్తులు వ్యాపారాలు, జీవితాలు, తన సంబంధాలను గురించి చాలా వివరంగా తన ఆత్మకథలో వ్రాశాడు.

మ్యూచువల్  ఫిల్మ్ కార్పోరేషన్ వారి కాంట్రాక్టు ప్రకారం హాలీవుడ్‌లో ఒక స్టూడియోను కిరాయికి తీసుకొని చిత్రాలు తీయటం ప్రారంభించి "ది ఫ్లోర్ వాకర్" (The Floor Walker) తీశాడు. బాక్సాఫీస్ హిట్ ! తర్వాత నెల రోజులకొక రెండు రీళ్ల చిత్రాన్ని తీశాడు.  (ఈ చిత్రాల జాబితా చివర ఇవ్వబడింది) పదహారు నెలల్లో 12 హాస్యవినోద చిత్రాలు ఎన్నో చిన్న చిన్న కష్టాలకోర్చి తీశాడు. ఒక్కోసారి ఎలా చిత్రించాలో తెలియక తికమకపడి అందరిలో నవ్వులపాలయ్యేవాడు.  తెగ ఆలోచించేవాడు.  కొన్ని రోజులు పని పూర్తిగా మానివేసేవాడు.  తను ఆలోచించేటప్పుడు, కష్టపడినట్లు బాధపడినప్పుడు, జనం తన కోసం బాధపడటం, తన చుట్టూ చేరటం చాప్లిన్‌కి నచ్చేది కాదు. అయితే సమస్యకు పరిష్కారం

అంతలోనే దొరికేది ! విచారం అంతా పోయేది ! ఎక్కడ చూచినా స్టూడియోలో మళ్ళా ఆనందం ! చిత్రాలు తీయడంలో ఎంతో మెలకువ, నైపుణ్యాన్ని చూపించేవాడు. ఎప్పుడూ ఎవరికీ కూడా బాధలు కలుగకుండా చిత్రాలు తీశానని వ్రాశాడు ఒకసారిమట్టుకు ఒక సన్నివేశంలో వీధిలైటు జారి మీదపడి తన ముక్కుకే రెండు కుట్లు పడ్డాయి. అప్పుడుమటుకు కొందరు పత్రికలవాళ్లు షూటింగ్‌లో చాప్లిన్ బలంగా గాయపడ్డాడని వ్రాస్తే అభిమానుల దగ్గర నుండి ఉత్తరాల పరంపర !

మ్యూచువల్ కార్పోరేషన్ కాంట్రాక్టు చాలా ఆనందంగా ముగిసింది. అప్పటికి ఆయనకు 27 సంవత్సరాలు బాదర బందీలేదు. ఉజ్వల భవిష్యత్తు తన ముందు వుందని, ప్రపంచం యావత్తూ మిత్రత్వంతో తనకు స్వాగతం పలుకుతుందని, త్వరలోనే మిలియనీర్‌నవుతానని ఆలోచనలు వస్తుండేవి అవన్నీ పిచ్చి వూహలనీ, పనికిరాని ఆలోచనలనీ తలచేవాడు. వారానికి పది వేల డాలర్లు వస్తుండేవి ఐదువందల వేల డాలర్ల ఆస్తిపరుడపుడు ఆయన ఆలోచనలను అందరూ గౌరవించేవారు. చాలా సన్నిహిత మిత్రులుగా, బంధువులుగా, ప్రవర్తించేవారు ! పొగడేవారు. కాని చాప్లిన్‌కి యివన్నీ నచ్చేవి కావు. ఎవరితోనూ సన్నిహితంగా ఉండేవాడు కాడు. మనస్సు సరిగా ఉంటే, ఒంటరితనాన్ని భరించలేనపుడు మిత్రులంటే, సంగీతమంటే యిష్టపడేవాడు

ఒక రోజు చాప్లిన్ అన్న సిడ్నీ "తమ్ముడూ మనం యిప్పుడు మిలియనీర్ల వర్గంలో చేరామని" అన్నాడు. ఫస్ట్ నేషనల్ కంపెనీతో కొత్త కాంట్రాక్టు చేపట్టారు 8 రెండు రీళ్ళ సినిమాలకు పదిలక్షల రెండువందలవేల డాలర్లు. చాప్లిన్‌కి చాలా ఆశ్చర్యం వేసినా, ఆ సినిమాలన్నీ తీసి ఆ ధనాన్ని సంపాదించాలనిపించింది అయినా చాప్లిన్ జీవిత విధానంలో ఏ మార్పూ రాలేదు ధనం వస్తున్నదేకాని దానిని వినియోగించుకోలేదంటాడు తాను సంపాదించిన ధనం ఒక "లెజండరీ" అంటాడు - కుప్పలుగా వచ్చేదికాని ఆయనెప్పుడూ అంకెలు వినడం తప్ప, ఆ ధనాన్నెప్పుడూ చూడలేదు ! అంత ధనం వుందని అనుకోవటానికి అన్నీ సమకూర్చుకున్నాడు - బ్రహ్మాండమైనకారు, కార్యదర్శి, అంతరంగికులు, అన్న సిడ్నీ వ్యవహార నిర్వహణం. చాలామంది వ్యాపారాల్లో భాగస్తులుగా వుండమని కోరినా అంగీకరించలేదు సినిమా గొడవ తప్ప, వ్యాపారంలో ధన సంపాదన జోలికి పోలేదు - కాని ధనమంటే ఆశ లేకపోలేదు-దానికి ఆయన బాల్యదశలో అనుభవించిన దరిద్రమే కారణం కావచ్చు. మొత్తానికి మూడు విషయాలుమట్టుకు

చాప్లిన్ జీవితాన్ని గురించి వ్రాయవచ్చు - ఆయన ఒంటరి భావనాలోకం, సినిమాల గురించి ఆలోచనలు, ధన సంపాదన - ఈ మూడింటి మధ్యే యితర సామాజిక, రాజకీయ, మానవాత్మకమైన - చింతన, కృషి సాగింది.

గొప్ప గొప్ప హాలీవుడ్ కళాకారులతో ఆయనకు పరిచయాలు, స్నేహం వుండేది వారిలో మెల్బా లియోపాల్, గొడవస్కే, పాడోవస్కే, సిజనిస్కీ పావ్‌లోవా, లేడిమౌంట్ బాటెన్, బాలెడ్ డ్యాన్సర్లు, పియానో వాద్యకారులు, నాడోర్ వస్కి, (తరువాత పోలాండు ప్రధానమంత్రి అయ్యాడు). సర్‌హెర్‌బర్ట్ బీర్భటీ, కానస్టన్స్ కోలియర్, ఐరిస్‌ట్రీ, డగ్లస్ ఫేర్‌బ్యాంక్స్ యింకా అనేక ప్రసిద్ధ సీనియర్ నటులు. చాప్లిన్ మటుకు ఎక్కువ కాలం ఆదివారాలు, తీరిక వేళల్లో డగ్లస్ ఫేర్‌బ్యాంక్స్ కుటుంబంతో సన్నిహితంగా వుండేవాడు ఎందరో ప్రముఖ రచయితలు, మేధావులతో శాస్త్రజ్ఞులతో పరిచయాలుండేవి వారిలో సామర్ సెట్‌మామ్, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, హెచ్.జి. వెల్స్ ముఖ్యులు

హాలీవుడ్‌లో ఐదు ఎకరాల స్థలంకొని 1917 లో తన స్వంత స్టూడియో 20,000 డాలర్ల ఖర్చుతో నిర్మించుకున్నాడు. స్టూడియో నిర్మాణంలో వుండగా ఎడ్నా పర్వియన్స్ అనే అందమైన తారతో ఒక నెలరోజులు హానొలులూ హవాయ్‌లకు వినోద పర్యటనలకు పోయి హృదయాన్ని కలుపుతాడు. ఆమెను వివాహమాడాలనుకుంటాడు, కాని ఎడ్నా చాప్లిన్‌ను గాఢంగా ప్రేమించటం వల్ల చాప్లిన్‌తో ఎవరు సన్నిహితంగా దగ్గరకు వచ్చినా అసూయతో సహించలేక పోయేది. దాంతో చాప్లిన్ సందిగ్ధ పరిస్థితుల్లోపడి పెళ్ళి విషయం మానుకున్నాడు. ఆమెతో మంచి స్నేహితుడుగా వుండడం మంచిదనుకున్నాడు. ఆ తర్వాత ఆమె జీవితాంతం వరకు చాప్లిన్ సినిమాలలో పని చేస్తుండేది ఆమెతో " ఎ వుమన్ ఆఫ్ పారిస్ " (A Woman of Paris) చిత్రాన్ని తీశాడు.

## చాప్లిన్ తాత్వికచింతన
## (Philosophy of Life)

ఎప్పుడూ పనిచేస్తూ వుత్సాహాన్ని తెచ్చుకోవాలనుకునేవాడు చాప్లిన్. క్రమశిక్షణతో, శ్రద్ధతో పనిచేయాలనుకునేవాడు. రాత్రిళ్ళు త్రాగుడు, స్త్రీల సాంగత్యంలో గడిచినా, ఒక రాత్రి స్త్రీతో సంబంధంవల్ల ఒక మంచి నవల యొక్క ఒక్క పేజీ వృధా అవుతుందని అనుకొనే రచయిత బాల్జాక్‌లాగ, రాత్రిపూట

స్త్రీలతో సంబంధంవల్ల స్టూడియోలో ఒక రోజంతా వృధా అవుతుందని విశ్వసించేవాడు. అంత మాత్రంచేత ఆయన తాగలేదని, తిరగలేదనికాదు అందమైన వయస్సున్న తార లెందరితోనో బాగా పరిచయాలున్నవాడు, నిజానికి ఆయన సినిమా కథానాయికా పాత్రలు ధరించిన వాళ్ళందరితో ఆయనకు సాంగత్యం వుండేది కాని సినిమా పరిశ్రమను గురించి దానికి సరియైన నటన, కామెడీ రచన, పని అభివృద్ధి, ధన సంపాదన గురించి ఎక్కువ ఆలోచన చేసేవాడు. ఒక ప్రముఖ నవలా రచయిత్రి, చాప్లిన్ తన ఆత్మకథ వ్రాస్తున్నాడని తెలిసి ఆయనను "మీ జీవితానుభవాలను గురించి, ధైర్యంగా, నిజంగా వ్రాయగలరా?" అని అడిగింది. ఆమె తన రాజకీయ జీవితాన్ని గురించి అడిగిందే మోననుకున్నాడు. కాని ఆమె ప్రస్తావించింది చాప్లిన్-స్త్రీల సంబంధాలను గురించి. అయితే ఒకని శీలాన్ని గురించి తెలుసుకోవాలంటే స్త్రీలతో గల లైంగిక సంబంధాలవల్ల తెలియదనీ, సంక్లిష్ట ప్రవర్తనకు ప్రధాన కారణం సెక్స్ అని ఫ్రాయిడ్ మాదిరిగా తాను నమ్మననీ, పేర్కొంటూ చలి, ఆకలి, దారిద్ర్యంలో పొందే బాధ తీవ్రత, అవమానం, ఒక వ్యక్తి మానసిక ప్రవర్తనకు ముఖ్యంగా కారణభూతాలౌతాయని చెప్పాడు. అందరిలాగే లైంగిక సంబంధాలున్నా, అవి అంత ముఖ్యమైనవి కావని చెప్పాడు. జీవితాన్ని గురించి నిజంగా వ్రాయడానికి ధైర్యం వున్నా, యితరుల ప్రసక్తి వస్తుంది కాబట్టి వారిని గురించి వ్రాయడం సబబుకాదు కనుక, ఆత్మకథలో అరవై ఐదు శాతం వరకు మాత్రం నిజాలుంటాయని వేరొక చోట అంటాడు.

ఫస్ట్ నేషనల్స్ కంపెనీ వారికి తీసిన ప్రథమ చిత్రం "ఒక కుక్క జీవితం"(A Dog life) ఒక తిరుగుబోతు (Tramp) జీవితానికీ, ఊరకుక్క జీవితానికీ సారూప్యంగల వ్యంగ్య చిత్రం. కుక్కల కొట్లాటలో ఒక కుక్కని రక్షించటం ఇందులో కథ. వీధి నృత్యాలు చేస్తున్న ఒక నాట్యకత్తెను రక్షించటం-ఆమెది కూడా కుక్క జీవితమేనని! తిరుగుబోతయిన నాయకుడు తనే (Tramp) నాట్యకత్తెను రక్షించాలి !

చార్లీ ప్రతి చిత్రంలో ఒక అందమైన అమ్మాయి వుంటుంది. ఆ అమ్మాయిని కష్టాల నుండి రక్షించాలి. ఆ అందమయిన అమ్మాయి దేశ ద్రిమ్మరి, తిక్కతిక్కగా వున్న మన నాయకుణ్ణి (ట్రాంప్) ఆకర్షింపజేయడం పెద్ద సమస్య అయ్యింది. చాప్లిన్‌కి అన్ని సినిమాలలో యిదే సమస్య. కాని ఏదో ఒక విధంగా ట్రాంప్ వాళ్ళను ఆకర్షిస్తాడు. వాళ్ళను ప్రేమిస్తాడు. వాళ్ళు మట్టుకు ప్రేమించరు! అసంతృప్తి మిగులుతుంది.

చాప్లిన్ చిత్రాలకు కథా రచన ఆయనే చేసుకునేవాడు అయితే తాను రచయితగా బాగా అభివృద్ధి అయిన తర్వాత కామెడీకి స్వాతంత్ర్యం తగ్గిందనుకున్నాడు "ప్రారంభదశలో ప్రేక్షకులు చాప్లిన్‌కి బానిసలైతే తర్వాత రోజుల్లో చాప్లిన్ ప్రేక్షకులకు బానిస" అయ్యాడని ఒక అభిప్రాయం. హాస్య సినిమాలను గురించి వ్రాస్తూ, హాస్య చిత్రాలకు మూడ్ ముఖ్యంగా సంగీతం సమకూర్చుతుందంటాడు. సాధారణంగా ఒక సినిమా సంగీతం యింకొక సినిమా కథకు వూహల్ని సమకూర్చేది. ఇవన్నీ సోదాహరణంగా తన స్వీయచరిత్రలో వ్రాస్తాడు చాప్లిన్ సినిమాలన్నిటిలో హాస్యం కరుణ ప్రధాన రసాలు. వేరువేరుగానూ, కలిసికట్టుగానూ అదొక విచిత్ర సన్నివేశాలతో అద్భుతంగా రూపొందాయి. పైకి సామాన్యంగా కనపడుతుంది. ఎన్నో విచిత్ర విపరీత వ్యంగ్య స్ఫూర్తితో అసాధారణంగా స్పృశిస్తుంది. విపరీత ఆలోచనల పుట్ట చాప్లిన్ బుర్ర. ఈ విషయంలో చాప్లిన్ భావాలను గురించి తెలుసుకోవడం అవసరం.

1916 నుండి భవిష్యత్తు సినిమాల గురించి ఎన్నో ఆలోచనలుండేవి అందులో ఒకటి చంద్రమండలయాత్ర! అక్కడ ఒలింపిక్స్ క్రీడలు ప్రదర్శించాలని గురుత్వాకర్షణ శక్తితో అక్కడ ఆటలు ఆడడం సాధ్యమని నిరూపించాలనేది ! ఇది మానవుని అభివృద్ధిపై వ్యంగ్య భరితమైన వ్యాఖ్యానం. రెండవది ఒకటి తినిపించే యంత్రాన్ని గురించి, ఆలోచనలు రికార్డుచేసి రేడియో ఎలక్ట్రిక్ హాట్‌ను గురించి చిత్రించాలనేది తినిపించే యంత్రాన్ని "మోడర్న్ టైమ్స్" చిత్రంలో చూపెట్టాడు. ఇదికూడా పారిశ్రామికీకరణమీద వ్యంగ్యరూపమే.

ఎంతోమంది చాప్లిన్‌ను చిత్రాలు తీయటానికి ఆలోచనలు (Ideas) ఎలా వస్తాయని ? అడిగారు, కాని సంతృప్తికరమైన సమాధానం దొరకలేదు. అయితే వయస్సు వచ్చేకొద్దీ ప్రబలమైన కోర్కెల ద్వారా ఊహలు, భావాలు బయట పడతాయని కనిపెట్టాడు. నిరంతరం కోరికలతో మేధ ఎన్నోరకాల సంఘటనలకు ఎదురు చూస్తుంది. అటువంటి సంఘటనలు తటస్థించినపుడు ఊహలకు, ఆలోచనలకు రెక్కలు వస్తాయి. ఉదాహరణకు సంగీతం, సూర్యాస్తమయం ఎన్నో భావాలను కలిగిస్తాయంటాడు. పేరుకుపోయిన ఆలోచనల నుండి ఏరిపారేయగా మిగిలిన వాటిపై ప్రయోగమే మనకు కావలసిందిగా భావించుకోమంటాడు. ఒక ఊహ, భావన ఎలావస్తుంది ? అంటే అతి సాహసం నుండి, విపరీత మానసిక ఉద్రిక్తత, ఉద్వేగందాకా వున్న పరిస్థితులలో నుండి వస్తుందంటాడు. అనతి కాలంవరకు దుర్భరమైన బాధలు, అతి మిక్కిలి సంతోషం అనుభవించగలిగేశక్తి

కలిగివుంటే భావనలేర్పడతాయి, కాని యిది అందరికీ సాధ్యం కాదంటాడు.

సాధారణ హాస్య వ్యంగ్య ప్రక్రియను తాత్విక ధోరణిలో ఆశ్చర్యం, ఉత్కంఠ (Surprise and Suspens) కలిగించటమే అనుకుంటారని చెప్తూ, మానవ ప్రవర్తనను గురించి వివరించటం జీవితాన్ని వివరించటమంత కష్టమైనపని అంటాడు. అయితే ఫ్రాయిడ్ మాదిరిగాక, మన ఆలోచన, భావనాశక్తి ఒత్తిడులకు కారణం మన పూర్వీకుల సాంప్రదాయాలనుండి ఉద్భవిస్తుందంటాడు. (Most of your ideational compulsions stem from atavistic causes) "మానవ జీవిత సర్వస్వం సంఘర్షణం బాధామయం" అనే సిద్ధాంతం మీదనే తన ట్రాంప్ పాత్ర ఆధారపడిందనీ, తన హాస్య కధలన్నీ ప్రజలను కష్టాల నుండి బయటపడవేసే ప్రయత్నమేనని వ్రాశాడు.

చాప్లిన్ దృష్టిలో హాస్యంవేరు, చమత్కారంవేరు ( Humour is different from subtle) హాస్యం ద్వారా ఏది హేతుబద్ధంగా కన్పడుతుందో దాంట్లో నిర్హేతుకత్వం, ఏది ప్రముఖంగా కన్పడుతుందో దాంట్లో అప్రధానత్వం చూస్తామంటాడు (Through humour, we see in what seems national The irrational, in what seems important the unimportant) హాస్యం ఉండటం వల్లనే మనం బాధామయ జీవితాలను తట్టుకోగలిగి, మన ఉనికిని, జీవికను నిలబెట్టుకుంటామంటాడు చాలా అర్థరహితమైన జీవితానికి హాస్యం క్షణకాలంలో ఆనందాన్నిస్తుంది అంటాడు చాప్లిన్ (ఇదంతా మౌనంగానే జరుగుతుంది చాప్లిన్ చిత్రాలలో )

## నటన, కళ

సినిమాలు, నటీనటులు, డైరెక్టర్లు, ఫోటోగ్రఫి, స్క్రీన్‌ప్లే అనేక యితర విషయాలను గురించి తాను ఎలా భావించాడో చాలా వివరంగా వ్రాశాడు. ఒక నటునిలో వున్న టాలెంట్‌ని వెలికితీయాలంటే మానసిక శాస్త్ర విజ్ఞానం అవసరమంటాడు. కొన్ని కోట్ల ధనం, వందలాది నటీనటులు, పెద్దకధ, టెక్నిక్ దృశ్యాలు, విస్తృతమైన సెట్టింగులు, యివన్నీ సరైన చిత్రాన్ని తీయలేదనీ, అటువంటి చిత్రాలు జీవితంలోని అన్ని సమస్యలను తీర్చినా, మనిషిని మాత్రం ఆలోచింపజేయలేవని అంటాడు. కనుక అవన్నీ చెత్త అంటూ, నాటక రచయిత మేధస్సుకాదు చూపించవలసింది, ప్రేక్షకుల భావోద్రేకాల (emotion) మీద పనిచేయాలంటాడు. నాటకీయత కావాలంటాడు.

షేక్స్పియర్ నాటకాలంటే తనకిష్టంలేదంటాడు చాప్లిన్. ఆనాటికాలంలో రాజులు, రాణులు, గొప్పవాళ్లు, వాళ్ల గౌరవాలు తనకు నచ్చవంటాడు. అతడు పొందిన మానసిక పరిస్థితుల్లో రొట్టె, తిండికోసం పడినపాట్లలో గౌరవానికి పెద్దచోటు లేదంటాడు. రాకుమారుల సమస్యలను గూర్చి తాను ఆలోచించలేనని హామ్లెట్ తల్లి రాజ ప్రాసాదంలో ఎందరితో కులికినా, దానివల్ల హామ్లెట్ ఎంత కుమిలినా తనకేం పట్టదంటాడు చాప్లిన్. అందుకని తాను సాంప్రదాయక (Conventional) నాటకాలలో విశ్వాసం గలవాడిననీ, లౌకిక జగత్తు నుండి ప్రేక్షకులను విడదీసి వాళ్ళకు వేరే ప్రపంచాన్ని చూపించలేననీ, కనుక రోజువారీ మనం చూచే దృశ్యాలనే వాస్తవ దృష్టితో చూపించాలంటాడు.

నటుడైనా ఏ కళాకారుడైనా, తన కళా ప్రదర్శన చేస్తున్నపుడు విశ్రాంతి పొందుతున్నట్లు భావన రావాలని, (Acting in an art of relaxing) ప్రత్యేకంగా నటునికి తనపై కొంత అదుపు, ఆత్మతృప్తి (Inner containment) కావాలంటాడు. ఎంత కష్టమైన సన్నివేశంలో నటించాలన్నా నటుడు శాంతంగా (Calm) విరామంగా (Relaxing) తనలో వున్న మానసిక ఉద్రేకాలకు మార్గదర్శకత్వం వహిస్తూ, మార్గం చూపుతూ, బాహ్యమైన వైయక్తిక ఉద్రేకాలను నియంత్రించుకుంటూ, లోనున్న వ్యక్తిని నిర్దేశించగలగాలంటాడు చాప్లిన్ తన నటన గురించి చెప్తూ, తానుగా నటించటానికి మొదలు పెట్టేటప్పుడు మానసికంగా విపరీతమైన ఉద్రేకానికి గురై బిగుసుకుపోయి ఉద్వేగ పరిస్థితికి దారితీసి, స్టేజిమీదకు పోగానే బాగా అలసిపోయి వుంటాననీ, ఆ సమయంలో తాను స్టేజిమీద విశ్రాంతి (Relaxing) పొందుతూ నటిస్తానంటాడు.

యాక్టింగ్, బోధించటంవల్ల, నేర్పటంవల్ల రాదంటాడు చాప్లిన్ చాలా తెలివి కలవాళ్ళు కూడా నటించటంలో విఫలమైనారని తెలివితక్కువ వాళ్ళు కూడా బాగా నటించడం జరిగిందని, కనుక నటనకు కావలసింది ఫీలింగ్ (Feeling) అంటాడు. మేధ, భావన-రెండింటి మధ్య సరైన సమస్థితిలో, ఐక్యతను సాధించగలిగినప్పుడే గొప్ప నటుణ్ణి పొందగలమంటాడు. గొప్ప నటుడు ప్రాధమికంగా నటించటంలో తన్ను తాను ప్రేమించుకోమంటాడు. తాను వేసిన పాత్రలో తన్ను తాను ప్రేమించుకోవాలి తనలో ఉన్న గొప్పతనాన్ని గుర్తించి, దాని కోసమే తపన చెందాలి. ఇది కొంత ఆత్మశ్లాఘ్యమైనా తప్పదంటాడు. నటించటానికి ఆత్మ విశ్వాసం కావాలి, పాత్రలో జీవించాలి. దానికి కావలసింది "ఎంపతీ" అంటే పాత్రలోకి చొచ్చుకుపోయి భావైక్యత చెందే గుణంతో పాత్రయొక్క ఆత్మలోకి లీనం కావాలంటాడు ఇది నేర్చుకుంటేగాని రాదని చార్లీ అభిప్రాయం

జీవితాలలో వున్న సున్నితమైన అంశాలు ఏ నాటక రచయిత భావాలకూ అందవనీ, అందుకని నటుడు ఒక పాత్ర జీవితచరిత్రను ముందుగా బాగా అధ్యయనం చేయటం అవసరమంటాడు చాప్లిన్ చాప్లిన్ నాటక రచయితగా, నటునిగా, జీవితంలో వున్న సున్నితత్వాన్ని పాత్రద్వారా అధ్యయనం చేయటానికి ఎంతో కృషి చేస్తాడు. పాత్రద్వారా ప్రదర్శించటానికి పాత్ర సృష్టి ఆయనదే కాబట్టి, పాత్రధారిగా తాను నటించటానికి చాలా సులభమై వుంటుంది. రచయితగా వ్రాయలేని సున్నితత్వాన్ని నటనలో ప్రదర్శిస్తాడు. ద్విపాత్రాభినయం-పాత్ర సృష్టి, పాత్ర నటన - బోధనా సంస్థలు, నటించడం నేర్పడాన్ని చాప్లిన్ నిరసిస్తాడు విద్యార్థి మేధస్సుకు శిక్షణ నివ్వడమంటే నటించటానికి పనికిరాడని చెప్పటానికి నిదర్శనం అంటాడు. తానుగా నటించడం ఎవరి దగ్గరా నేర్చుకోలేదని, అదృష్టవశాత్తు ఆ రోజుల్లో వున్న గొప్ప నటులతో సాంగత్యం, అనుభవం, విజ్ఞానం వల్ల, స్వతహాగా తనకున్న నటనాకౌశలం వల్ల, నటుడినైనా నంటాడు. పుట్టుకతో నటనా జ్ఞానం కొంత కలిగివున్నా, నటనా శిల్పాన్ని గురించి నేర్చుకుంటే, నటనా చాకచక్యం, నిపుణత మెరుగులు దిద్దుకుంటాడు చార్లీ

నటునికి నటనా దృక్పధం అవసరం, స్టేజి మీద ఎలా నిల్చోవాలి, ఎలా కూర్చోవాలి, ఎలా తిరగాలి, ఎలా పాత్రలో లీనం కావాలి, ఎలా మాట్లాడాలి తెలుసుకుంటే కళాకారుడుగా నటన మీద అధికారాన్ని సాధిస్తాడని, అదే పద్ధతిలో తాను నటించానని, దర్శకత్వం వహించానని చెపుతాడు. సంభాషణలు పలకడంలో, స్వరాన్ని పలికించడంలో కొంత స్వయం నియంత్రణ అవసరమంటాడు తనకు నచ్చిన పాత్రలు, వినోదం, హాస్యం కలిగించేవనీ, భారీ, సీరియస్ పాత్రలు నచ్చవంటాడు. అయితే చాప్లిన్ నటన మనకు హాస్యాన్ని, వినోదాన్ని కలిగించేవైనా అవి చాలా సీరియస్ పాత్రలు. ఒక విధంగా భారీ పాత్రలు కూడా. అయితే పైకి భారీగా కనబడవు. అదే చార్లీ చాప్లిన్ నటనలో వున్న గొప్పతనం. పాత్ర సృష్టిలో వున్న విశిష్టత. ఇది చార్లీకి తన తల్లిదండ్రుల ద్వారా పుట్టుకతోనే రావటం కాకుండా, అపారమైన స్వయం కృషి, ఏదో తపనా, ఆలోచన ద్వారా సాధించాలని సాధించాడు. మానవత్వపు సమస్యలను తానుగా అనుభవించినవీ, తెలుసుకొన్నవీ మన ముందుంచుతాడు. అందుకే ఆయన నటన సజీవం. ఆయన పాత్రలు చావులేనివి, ఆయన అమరుడు

సాధారణంగా చార్లీ చాప్లిన్ రాజకీయాల జోలికి పోలేదు. రాజకీయ విషయాలలో అభిరుచి చూపించలేదు. కాని ఆయనకున్న శాంతికాముకతా మానవతా దృక్పధం

చరిత్రలో జరుగుతున్న కొన్ని సంఘటనలకు దూరంగా వుండలేకపోయాడు. లేదా కొందరు ఆయన్ని దూరంగా ఉండనివ్వలేదు. ప్రజాస్వామ్యం పేరుతో ప్రథమ ప్రపంచ సంగ్రామంలో జరిగిన మారణహోమం, అనాగరికతకు చిహ్నంగా విచారించాడు. స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనటానికి ఆ రోజుల్లోవున్న పెద్దలతో కలసి జర్మనీకి వ్యతిరేకంగా ఉపన్యాసాలిచ్చాడు. అమెరికన్ ప్రెసిడెంట్ విల్సన్‌ని కలిశాడు. లిబర్టీ బాండ్స్ అమ్మకాలలో పాల్గొన్నాడు. యుద్ధాన్ని ఖండించినందుకు కొందరు ఆయన పక్షం వహించినా కొందరు ఆయనను విమర్శించారు. యుద్ధం ఆగిపోయిన తర్వాత శాంతి వచ్చినట్లుగా కన్పడినా, యింతకు ముందున్న నాగరికత యిక ముందు వుండబోదని ఆ యుగం అంతరించిందని, ప్రాథమిక నాగరికతా లక్షణాలు యిక మిగలవని నూతన ప్రపంచంలో అడుగు పెడ్తున్నామని చాప్లిన్ భావిస్తాడు.

యుద్ధ పరిస్థితులవల్ల, సాంకేతికాభివృద్ధివల్ల, యింకా అనేక కారణాల వల్ల సినిమా నిర్మాణ వ్యయం ఎక్కువయింది. అందుకని చిత్రనిర్మాణ ఖర్చులకు ధనం ఎక్కువ ఇవ్వాలని చాప్లిన్ తన కంపెనీ వారిని అడిగితే వారు నిరాకరిస్తారు. పైగా చిత్రనిర్మాణ కంపెనీ అధిపతులందరూ కలసి పెద్ద వ్యాపారం చేసి, చిన్న చిన్న నిర్మాతలను, సినిమావాళ్ళను అణగదొక్కడానికి ప్రయత్నాలు చేశారు. సిడ్నీ, డగ్లస్, మేరీ పిక్ ఫోర్డ్ మొదలగు మిత్రులందరూ కలిసి వాళ్ళ పథకాలను చిత్తుచేయాలని ఎంతో కష్టంతో అందరినీ కూడగట్టుకొని సినీ పరిశ్రమను, నటీనట వర్గాన్ని దృష్టిలో పెట్టుకొని యునైటెడ్ ఆర్టిస్ట్ కార్పొరేషన్ (United Artists Corporation) ని చాలా సాహసంగా స్థాపిస్తారు. ఎందరో నిర్మాతలు తర్వాత వీరి కంపెనీలో చేరారు. కొత్తసంస్థ వెంటనే చిత్రాలు తీయటం ప్రారంభించింది. ఆవిధంగా గుత్త వ్యాపారానికి ఎదురుగా ధైర్యంగా నిలిచారు చాలా తక్కువ రేటులో వాళ్ళు చిత్రాలను విడుదలచేసి ఎన్నో అప్పులకు గురైనారు. అయితే కంపెనీ తరఫున తీసిన "గోల్డ్‌రష్" చిత్రంతో అప్పులన్నీ తీరిపోయినాయి.

చార్లీ చాప్లిన్ చేసిన చిన్న వ్యాపారాలలో సంగీతం పుస్తకాలను ప్రచురించి అమ్మటం ఒకటి. చెర్ట్ క్లార్క్ అనే పియానో సంగీత విద్వాంసునితో కలసి చాప్లిన్ కంపోజ్ చేసిన సంగీతం, రెండుపాటలు కలిపి రెండువేల కాపీలు ముద్రించి అమ్మటానికి ఒక ఆఫీసు తెరిచారు. నెలరోజుల్లో మూడు కాపీలు మాత్రం చెల్లిపోతాయ్! అందులో రెండు కాంప్లిమెంటరీలు ! ఆఫీసు మూతపడుతుంది !

# చాప్లిన్ ప్రథమ వివాహము

1917లో ఒకనాటి వుదయాన్నే చార్లీ బయటి కెళ్ళబోతుండగా టెలిఫోన్ మ్రోగుతుంది. ఆ టెలిఫోన్ ఆ సమయంలో రాకపోయినట్లయితే తన జీవితం యింకొక విధంగా వుండేదనుకుంటాడు చాప్లిన్. టెలిఫోన్‌లో చాప్లిన్ మిత్రుడు శామ్ గోల్డ్విన్ ఆ సాయంత్రం తన బీచ్ బంగళాకు జలక్రీడలకై రమ్మనమని ఆహ్వానం.

ఎంతో సుందరమైన సాయంత్రం ! అందమైన కన్నెలెందరితోనో జలకాలాటలు! సాయంత్రం అయిపోతుండగా మిల్ రెడ్ హారిస్ అనే ఒక అందగత్తె హామ్ అనే ఆయనను వెంటబెట్టుకొని వస్తుంది. చాప్లిన్ ఆమెను గురించి పట్టించుకోకపోయినా, యింటికిపోయే సమయంలో ఆమె చార్లీ వద్దకువచ్చి తన వెంటవచ్చిన మిత్రుడు తగువుపెట్టుకొని వెళ్ళిపోయాడని, కనుక ఆమెను తన యింటివద్ద చాప్లిన్ కారులో దింపమని అడుగుతుంది. కారు ప్రయాణంలో వుబుసుపోకకు జరిగిన మాటలలో ఆమె పారమౌంట్ కంపెనీలో సినిమాలలో నటిస్తున్నదని తెలుపుతుంది. ఆమెను యింటి వద్ద దిగబెట్టిన తర్వాత చాలా కొంటెపిల్ల అనుకుంటాడు. ఇంటికి పోయి హాయిగా ఒంటరిగా గడపాలని చాప్లిన్ అనుకుంటూ యింటికి పోయిన ఐదునిమిషాలలో ఆమె దగ్గరనుండి టెలిఫోన్ వస్తుంది. "ఏం చేస్తున్నారు" ? అని అడిగింది గమ్మత్తుగా ఎంతోకాలంగా శృంగార లీలల్లో మునిగినవారన్నట్లుగా మాట్లాడడం చాప్లిన్‌కి ఆశ్చర్యం కలిగించింది. "భోజనం చేసి, చదువుకుంటూ పడుకుంటా" నని చాప్లిన్ "ఏం పుస్తకం? ఒంటరిగా వెచ్చగా నేను మీ పక్కలో ఎలావుంటానో వూహించండి!" ఆమె మాటలు, ఇలాంటి వేడి సంభాషణలతో చాప్లిన్‌లో విచిత్ర శృంగార భావాలు కలుగుతాయి. "మళ్ళా మీరు ఎప్పుడు కలుస్తారు?" అని ఆమె అడుగగా, "భోజనానికి ఈ రాత్రికే బయటికి పోదాం" రమ్మనమని చాప్లిన్ !

ఆ రాత్రి చాప్లిన్‌తో ఆ అందకత్తె, వగలాడి భోజనం చేసినా ఆయనలో ఒక సౌందర్యవతితో వున్నట్లు ఆనందం కలుగలేదు. ఆ తర్వాత నాలుగైదు రోజుల వరకు ఆమెను గురించి ఆలోచించలేదు. ఒకరోజు ఆమె టెలిఫోన్ చేసిందని సమాచారం అందిస్తూ, అంతటి సౌందర్యవతిని ఎక్కడా చూడలేదని కారు డ్రైవరు చెపుతున్నాడని సెక్రటరీ చెప్తాడు. ఈ మాటతో చాప్లిన్‌లోని షోకు బయటికొచ్చి అప్పటినుండి ఆమెతో డ్యాన్సులు, డిన్నర్లు, వెన్నెల రాత్రులు, సాగర క్రీడలు, అనేక చేష్టలు - కావలసినవన్నీ జరిగినై! అంతే! చాప్లిన్‌కు మిల్‌రెడ్ హారిస్‌తో

ప్రారంభమైనవి బాధలు ! ఆమె గర్భవతి కావటం, వివాహం చేసుకోవటం తప్పలేదు.

ఒకరోజు సెక్రటరీతో ఆమెను పెళ్ళాడడానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేయమంటాడు చాప్లిన్. మూడు రోజులలో ఎవరికీ తెలియకుండా స్థానిక రిజిస్ట్రార్ కార్యాలయంలో వివాహమాడాడు. పెళ్లికి ఎవరినీ పిలువలేదు. అతి సామాన్యంగా వుంగరాన్ని తొడగటంతో, ఐదు నిమిషాలలో అయిపోతుంది వివాహం. మూర్ఖునిగా, అనాలోచితంగా, అనవసరంగా, కోరి ఆ ఝంఝాటంలో యిరుక్కుపోయానని ఆ క్షణంలో అనుకున్నాడు. ఈ పెళ్ళికి ప్రాముఖ్యం లేదనుకుంటాడు. అప్పటికి చార్లీ చాప్లిన్ వయస్సు 29, ఆమెకు 19. తనకి భార్య కావాలి. ఆమె అందంగా వుండటం, వయస్సులో పెద్ద తేడా లేకపోవటం యేమిటో ఆలోచనలు, బహుశా అంతా సవ్యంగా జరుగుతుందని ఆశించాడు.

పెళ్ళయిన మరునాడు ఉదయం చాలా భారమైన హృదయంతో స్టూడియోకి వెళ్ళాడు. ఆ రోజు పత్రికలలో తాము వివాహమాడినట్లు వార్తలు చదివి, అందరూ అభినందనలు తెల్పారు అందరికీ ముభావంగా సమాధానం - తన వివాహం సఫలీకృతమౌతుందా? తన పనికి అంతరాయం కాదా? భార్యకు దగ్గరగా ఉండగలనా? తను ఆమెను ప్రేమించకపోయినా, ఆమె పెద్ద తెలివితేటలు కలది కాకపోయినా పెళ్ళిచేసుకున్నాడు కనుక, తమ వివాహం తప్పక సఫలం అవుతుందని ఆశిస్తాడు.

చాప్లిన్ భార్య మట్టుకు ఎక్కడో కథలలో చదివినట్లుగా, ఒక అందాలపోటీలో తాను గెల్చినట్లుగా భావించింది తప్ప, ఆమెకు వాస్తవ దృక్పథం లేదంటాడు. ఆమెతో ఏ విషయం సీరియస్‌గా మాట్లాడినా ఆమె పట్టించుకునేది కాదు. పెళ్ళయిన రెండవరోజునే యం.జి.యం కంపెనీతో ఆరు సినిమాలలో నటించటానికి 50 వేల డాలర్ల కాంట్రాక్టుపై సంతకం పెట్టింది. కాంట్రాక్టు ఒప్పుకోవద్దని, కావాలంటే 50 వేల డాలర్లు తాను ఒక సినిమాకే యిస్తానని చెప్పినా వినకుండా తనను వ్యతిరేకించిందని, చాప్లిన్‌కి ఆమెమీద, యం.జి.యం. కంపెనీ అధిపతి మీద కోపం, విసుగు కలిగాయి.

ఒక నెల రోజులలోనే ఆ కంపెనీతో ఆమెకు తగాదాలు రావటంతో యం జి.యం. కంపెనీ అధిపతి మేయరుతో మాట్లాడమంది ఆమె. చాప్లిన్ ఎట్టి పరిస్థితిలోనూ మేయరును కలువనంటాడు. చాప్లిన్ చెప్పింది వినకుండా మేయరును ఒకరోజు రాత్రికి విందుకు ఆహ్వానించింది. విందుకు కొద్ది నిమిషాల

ముందు మాత్రమే విందు సంగతి చాప్లిన్‌తో చెప్పింది. "వాడిక్కడకి వస్తే అవమానిస్తా" నని చెప్పి పడకగదిలో మునగ తీసుకొని పడుకుని నిద్ర నటిస్తుంటాడు మేయరు రావటం, విందు చేయకుండా పోవటం జరుగుతుంది.

ఆమె గర్భవతి కావటం చాప్లిన్‌కి పెద్ద ఆందోళన కలిగించింది ఎన్నో నెలలు గడిచాక, ఎంతో కష్టంతో మూడు రీళ్ళ కామెడీ "సన్నీ సైడ్" (Sunny Side) ఒకటి తీయగలిగాడు. వివాహం తన సృజనాత్మకశక్తిని దెబ్బ తీసిందని బాధపడుతుంటాడు. వివాహమాడిన సంవత్సరంలోనే ఒక బిడ్డ పుట్టి మరణిస్తుంది. ఒక యింట్లో వున్నా భార్య తనూ ఎప్పుడూ సౌఖ్యంగా, సఖ్యంగా లేరు. ఒకళ్ళనొకళ్లు చూచుకోవడానికే పడేది కాదు. ఎవరి స్టూడియో పనుల్లో వారుండేవారు. అపుడపుడు ఆమె ఎవరికీ చెప్పకుండా వారాల తరబడి ఎక్కడికో పోతుండేదట! ఇంటికి ఎప్పుడొచ్చినా తనొక్కడే మిగిలేవాడు. ఆ విధంగా భార్యాభర్తల మధ్య శాంతియుత సహజీవనం లేక విడిపోవటానికి దారి తీస్తుంది. ఎన్నో యిబ్బందులకు గురై లక్ష డాలర్లు యిచ్చి ఆమెతో విడాకులు తీసుకున్నాడు-అలా ముగుస్తుంది చాప్లిన్ మొదటి వివాహం.

## "ది కిడ్" (The Kid)

భార్యతో గొడవలు పడుతూండగానే, సన్నీ సైడ్ చిత్రం తీసిన తర్వాత ఏం చేయాలో తెలియక మార్పుకోసం ఆర్ఫీమ్ వెళ్లిన సందర్భంలో ఒక విచిత్రమైన నాట్యకారుణ్ణి చాలా సింపుల్‌గా నాట్యం చేస్తుండగా చూస్తాడు. నాట్యం అయిన తర్వాత నాలుగేళ్ళ అతని కొడుకుని స్టేజి మీదికి తీసుకురాగా, ఆ కుర్రాడు గమ్మత్తుగా డ్యాన్సు చేసి, ప్రేక్షకులవైపు చేతులూపుతూ తెరలోకి పరుగెత్తాడు. ప్రే క్షకులందరు విరగబడి నవ్వుతుంటే మళ్ళా ఆ కుర్రాణ్ణి స్టేజి మీదకు తీసుకువస్తారు. ఈ సారి యింకో కొత్తరకం డ్యాన్సు చేశాడు. ఆ డ్యాన్సు యితర ఏ పిల్లవాడు చేసినా అసహ్యంగా వుండేది. కాని ఆ పసివాడు జాకీ కూగన్ ఎంతో ముద్దుగా వుండటం వల్ల ప్రేక్షకులు ముగ్ధులైపోతారు. చాప్లిన్‌కి ఆ పిల్లాడిలో అలరించే వ్యక్తిత్వం ఏదో వుందనిపించింది.

ఆ బాలుని గురించి వారం పదిరోజుల దాకా చాప్లిన్‌కి మళ్ళీ ఆలోచనలేవీ రాలేదు. కొత్త సినిమా తీయటానికి ఏ ఆలోచనలు, భావాలు రావటం లేదని ఒకటే విచారపడ్తుండగా ఆ బాలుడు తన ఆలోచనలోకి వస్తాడు. ఎంత బాగున్నాడు,

ఎంత చక్కగా డ్యాన్సు చేశాడు అని స్టూడియోల వాళ్ళకు చెప్తుండగా ఆ రోజు పేపరులో ఒక సినిమా కంపెనీవాళ్ళు ఆ పసివాణ్ణి తీసుకున్నారని వార్త వచ్చిందని చెప్పగానే "నాకెందుకీ ఆలోచన రాలే" దని సినిమాలలో బ్రహ్మాండంగా ఉంటాడని వెంటనే కొన్ని వూహలు ఆయనలో రావటం, దృశ్యం తర్వాత దృశ్యం. తాను (Tramp) ఆ కుర్రాడు ఎలా నటించాలో ఆ పగలు రాత్రంతా కూర్చొని కధను తయారు చేస్తాడు - అదే "ది కిడ్" చిత్రానికి ఆధారం కావటం ఒక మెరుపుగా జరిగిపోయింది. అయినా ఆ పిల్లాడేడి? సమయం అంతా వృధా అయిందని, ఆ కుర్రాణ్ణి తను ముందుగా ఎందుకు బుక్ చేసుకోలేకపోయానని విచారించాడు

ఆ మరునాడు పిచ్చిపట్టిన వానిలా తయారవుతాడు అందరినీ స్టూడియోకి రమ్మంటాడు షూటింగ్ రిహార్సల్స్ చెయ్యమన్నాడు. కధలేదు. పాత్రలు లేవు ఎవరో ఆ కుర్రాడి మాదిరిగా వున్నవాణ్ణి తీసుకోకూడదా ? అంటారు ఇంతలోనే వాళ్ళ పబ్లిసిటి ఆఫీసరు రొప్పుకుంటూ రోజుకుంటూవచ్చి, ఆ కుర్రాడు జాక్ కూగన్ సినిమా కంపెనీలో చేరలేదని, చేరింది ఆ పిల్లాడి తండ్రి జాక్ కూగన్ అని తెలియజేశాడు చాప్లిన్ గంతులేస్తూ, తొందరగా ఆ పిల్లాడి తండ్రితో టెలిఫోన్‌లో మాట్లాడి, వున్నపళంగా, అర్థగంటలో తనదగ్గరికి రావలసిందని చాలా ముఖ్యమైన విషయం, అర్జంటుగా మాట్లాడాలని చెప్పాడు. అందరిలో ఉత్సాహం, విద్యుత్, చాప్లిన్‌కి అభినందనలు అయితే ఆ పిల్లాడి తండ్రి ఎక్కడ వెదికినా, ఎక్కడకు టెలిఫోన్ చేసినా దొరకలేదు. రెండు గంటలసేపు అందరిలో ఆందోళన. అందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచుతూ ఆ పిల్లాడి తండ్రి ప్రవేశిస్తాడు చాప్లిన్ పరుగెత్తుకెళ్ళి ఆయనను కౌగలించుకొని గుక్క తిప్పుకోకుండా "చాలా బహ్మాండమైన కని వినని సినిమా. ఆ చిత్రంలో మీవాడు నటించాలి" ఏదేదో వాగుతూ, ఉన్మాదిలా ప్రవర్తిస్తూ, ఈ చిత్రం మీ పిల్లాడి జీవితానికి ఒక పెద్ద అవకాశాన్నిస్తుందని చెప్పాడు - ఆ కుర్రాడి తండ్రి ఆశ్చర్యపోతూ వెర్రి సంతోషంలో తన కొడుకు చిత్రంలో నటించటానికి ఒప్పుకుంటాడు. ఆ పిల్లాడే "ది కిడ్".

చిన్న పిల్లలు, కుక్కలు సినిమాలలో బాగా నటిస్తారని ఒక సంవత్సరం బాలుడు, ఒక స్నానాల తొట్టె, ఒక సబ్బుతో మంచి చిత్రాన్ని తీయవచ్చంటాడు చాప్లిన్. పిల్లల్లో బ్రహ్మాండమైన జ్ఞానం వుంటుందని చెప్పాడు. ఆవిధంగా జాకీ కూగన్‌లో నున్న తెలివితేటలన్నిటినీ బయటికి తీసి ప్రసిద్ధమైన "ది కిడ్" చిత్రం తీశాడు.

చాప్లిన్ తీసిన అన్ని చిత్రాలకంటే ఈ చిత్రం గొప్పది. చార్లీ చాప్లిన్ తాను ప్రేక్షకులకు చెప్పవలసిందానిని చాలా తీరికగా అన్నిటికంటే చాలా నిడివైన

చిత్రంలో చెప్పాడు. ఈ చిత్రం చార్లీ స్వీయ చరిత్ర. తన బాల్యాన్ని గురించే చాలా అద్భుతంగా జాకీ కూగన్ అనే పసివాని ద్వారా కళాత్మకమైన సృష్టి చేశాడు లండన్‌లో తన చిన్నతనాన్ని గురించి ప్రదర్శిస్తాడు. ఆ పసివాడు, తను కలసి ఒకళ్లకంటే ఒకళ్లు అద్భుత నటనా ప్రదర్శనం చేశారు ఒకళ్లనొకళ్ళు అనుకరించారు ఐన్‌స్టీన్ ప్రకారం, నవ్వుతున్న ఒక పసివాని కళ్ళద్వారా అతి భయంకర, అతి నిర్మాణాత్మక, అతి విషాదాత్మక విషయాలను చూడటంలో వుంది చాప్లిన్ కళాత్మక హృదయం పసివానితో అమోఘంగా నటింపజేయటం చాప్లిన్ భావనాత్మక కళకు నిదర్శనం. చాప్లిన్ గత బాల్య స్మృతుల స్మరణతో అతి హృదయ విదారకంగా తన జీవితాన్ని గురించి చూపించాడు. చిత్రంలో చాప్లిన్ పనిలేకుండా తిరుగుతాడు (Tramp) తప్పిపోయిన ఒక పసివాణ్ణిసాకి, వాణ్ణి తనకంటే ముందు పంపి వీధిలో ఉన్న ఇళ్ళ కిటికీ అద్దాలను రాళ్ళువేసి ఆ కుర్రాడు పగలకొట్టూవుంటే, తాను కొంచెం వాడి వెనుకగా వెళ్ళి 'అద్దాలు బాగుచేస్తాం' అని పగిలిన కిటికీ అద్దాలను బాగుచేసి జీవనానికి సంపాదిస్తాడు. చాలా వినోదభరితంగా కనపడినా చాప్లిన్ తన గత దురదృష్ట జీవితాన్ని గురించి, ఆనాడు లండన్‌లో పరిస్థితుల గురించి అతి చమత్కారంగా ఆ కుర్రాడిని నటింపజేసి తాను కుర్రాడుగా భావిస్తాడు.

"ది కిడ్" చిత్రం తీసేటపుడు భార్యతో విడాకుల గొడవ జరుగుతుండేది. ఆ గొడవల్లో చిత్రం ప్రదర్శనకు రాకుండా చేయాలని కొందరు ప్రయత్నించారు. అందుకని ఎవరికీ తెలియని ప్రదేశానికి చాలా దూరంపోయి చిత్రాన్ని ఎడిట్ చేశారు - అయితే భార్యతో విడాకులు అయిపోతుంది చిత్రం కూడా అయిపోతుంది. లక్షా యాభై వేల డాలర్లకు అమ్ముడుపోతుంది గొడవలన్నీ అయిపోయాక మళ్ళీ ఏం చేయాలో తెలియక కొన్ని వారాలపాటు హోటలు గదిలోనే కూర్చొని ఆలోచనల్లో మునిగిపోయాడు. తర్వాత మిత్రుల ప్రోద్భలంతో మళ్ళీ న్యూయార్క్ నగరంలో జీవితాన్ని ప్రారంభించాడు. ఎటువంటి బాదర బందీ లేకుండా న్యూయార్క్‌లో వున్న రకరకాల మిత్రులతో విచ్చలవిడిగా తాగుతూ, తిరుగుతూ, విందులు, విహారాలతో, ఆనందంగా గడుపుతూ, ఎందరినో కలుస్తూ ఎన్నో విషయాలు చర్చిస్తూ కాలం గడపుతాడు, పుస్తకాలు చదువుతూ, గ్రీన్‌విచ్ గ్రామంలో వుండగా మేధావులెందరితోనో పరిచయాలు, గొప్పవాళ్ళతో మిత్రత్వం పెరగటం జరుగుతాయి. కొన్ని నెలలపాటు పనీ పాటా లేకుండా ఎందరితోనో పరిచయాలు పెంచుకొని వారి వ్యక్తిత్వాలను, వారి జీవితానుభవాలను గురించి తెలుసుకున్నాడు. ఆ రోజుల్లో విచిత్ర జీవితానుభవాల విందు నారగించానంటాడు.

ఫస్ట్ నేషనల్స్ వారికి యింకా రెండు సినిమాలు తీయవలసి వుంది. కాలిఫోర్నియా వెళ్ళి సినిమాలు తీయటానికి ఎన్ని రోజులు ప్రయత్నించినా బుర్ర పనిచేయలేదు. అందుకని కొన్నాళ్ళు చేపలు పట్టటానికని సముద్ర విహారానికి బయలు దేరాడు. చేపల వేటలో ఒక బ్రెయిన్ సర్జన్‌తో మాట్లాడుతూ పియానా, వాయిలెన్ పలికించటాని కెలాగయితే ప్రతిరోజూ ప్రాక్టీసు కావాలో ఆలోచించటానికి కూడా ప్రతిరోజూ ప్రాక్టీసు ఎక్సర్‌సైజ్ కావాలంటాడు నటించటం ఒక మానసిక అనుభవం, దానివల్ల ఆత్మ విశాలమవుతుందంటాడు. ఈ రోజుల్లోనే తల్లి ఆరోగ్యం బాగుపడటంతో ఆమెను ఇంగ్లాండు నుండి కాలిఫోర్నియాకి రప్పించుకున్నాడు. పది సంవత్సరాల తర్వాత మళ్ళా తల్లిని చూశాడు.

"ది కిడ్" తర్వాత "ది ఐడిల్ క్లాస్" అనే చిత్రాన్ని తీశాడు ఈ సినిమాలో నిరుపేదా దేశ ద్రిమ్మరి ఐన చాప్లిన్‌ని ఓదార్చటానికి ధనవంతుడొకడు దగ్గరికొస్తాడు. చాప్లిన్ నేలకేసి చూపిస్తాడు నేలమీద ఏదో ఉందనుకొని ఆ ధనవంతుడు వంగి చూడబోతాడు. ఆ సదవకాశాన్ని వినియోగించుకొని చాప్లిన్ ధనవంతుని ముడ్డిమీద ఒక తన్నుతన్ని సోమరి ధనవంతుల వర్గం మీద తన అమూల్య అభిప్రాయాన్ని, అసహ్యాన్నీ వ్యక్తపరుస్తాడు. ఆ తర్వాత మానసికంగా అలసిపోయి మార్పు కోసం పదేళ్ళ అమెరికా జీవితం తర్వాత ఇంగ్లాండుకు ప్రయాణమౌతాడు. చాప్లిన్ వస్తున్నాడని తెలిసి ఇంగ్లాండులో ఎంతో మంది తనని పొగుడ్తూ ఆహ్వానిస్తూ టెలిగ్రాంలు పంపారు. ఇంగ్లాండులో ప్రవేశించినపుడు వేలమంది ఆయనకు ఘన స్వాగతం పలికారు హోటలులో దిగగానే ఎవరికీ చెప్పకుండా వెనకదారి నుండి పదేళ్ళనాడు తాను నివసించిన ప్రదేశాలు, ఇళ్ళను చూడడానికి పోయాడు.

గతం గుర్తొచ్చి, తాననుభవించిన దుర్భరమైన పేదరికం గుర్తొచ్చి, పేదరికంలో గొప్ప ఆకర్షణ ఏమీ లేదని, జీవితం విలువలను తప్పుడు పద్ధతిలో అర్థం చేసుకోవటం తప్ప పేదరికం నుండి తాను ఏమీ నేర్చుకోలేదని, బీదతనం, ధనవంతుల గొప్పతనాన్ని, ఆడంబరాన్ని గురించి ఎక్కువగా చూపించిందనుకుంటాడు. ధనం, ఆడంబరం ప్రపంచాన్ని సరైన దృక్పథం నుండి చూడటం నేర్పాయనీ, గొప్ప వాళ్లలో కూడా అందరి మాదిరిగానే ఎన్నో లోపాలున్నాయని కనుగొన్నానంటాడు. మేధావిత్వం చదువువల్ల గాని, పురాణగ్రంధాలవల్ల కాని రాదని తెలుసుకున్నానంటాడు. అందరి మాదిరిగానే తాను తానేనని, ఒక వ్యక్తిననీ కాకపోతే కొంచెం తేడాతో చరిత్రాత్మక కలలు, కోరికలు, ప్రత్యేక అనుభవాలు గల ఒక విశిష్ట వ్యక్తినని అంటాడు.

ఇంగ్లాండులో గొప్ప వ్యక్తులైన హెచ్.జి.విల్స్ సర్ జేమ్స్ భారీ, బెర్నార్డ్‌షాలను, యింకా కొందరు రాజకీయ నాయకులను కలుస్తాడు అక్కడ నుండి పారిస్, బెర్లిన్ నగరాలకు వెళ్ళాడు. అక్కడ కూడ బ్రహ్మాండమైన స్వాగతం లభిస్తుంది.

## గోల్డ్ రష్ (Gold Rush)

ఇంగ్లాండు నుండి తిరిగొచ్చాక "ది పే డే" (The Pay Day) "ది పిలిగ్రిమ్" (The Pilgrim) "వుమన్ ఆఫ్ పారిస్" (Woman of Paris) చిత్రాలను తీశాడు. వాటితో ఫస్ట్ నేషనల్స్ వారి కాంట్రాక్టు తీరిపోయింది. తర్వాత యునైటెడ్ ఆర్టిస్ట్స్ కంపెనీకై చిత్రాలు తీయటం మొదలుపెట్టి గోల్డ్ రష్ (Gold Rush) తీశాడు. పొద్దుపోక ఒక మిత్రునితో కాలక్షేపం చేస్తుంటే వచ్చిన సంభాషణలో డొన్నార్ పార్టీ వ్రాసిన ఒక పుస్తకంలోని విశేషాలతో కలిపి కథ అనేది లేకుండా ఎన్నో రకాల సన్నివేశాలను చిత్రీకరించి వాటన్నిటిని కలిపి "గోల్డ్‌రష్" సినిమా తీశాడు. అతి నిస్సహాయ పరిస్థితులలో మానవుడు ప్రకృతి ఒత్తిడులను ఎదుర్కొంటున్నపుడు నవ్వకపోతే పిచ్చెక్కుతుందంటాడు చాప్లిన్. అట్టి పరిస్థితిలో మానవులు ఎలా ప్రవర్తిస్తారో చిత్రీకరించి చూపింది గోల్డ్‌రష్.

గోల్డ్‌రష్ పేరు సరైంది కాకపోయినా పెట్టాలనే పెట్టింది. బంగారపు వేట చాలా కొద్దిగా వుంటుంది. చిత్రం అలాస్కా లాంటి ఘనీభవించిన ప్రదేశంలో తీశారు. 1898 లో జరిగిన క్లోడైక్ బంగారపు వేట కథ - మంచు కొండల్లో ఆ మంచు ప్రపంచంలో చేరుతాడు చాప్లిన్. అక్కడొక చిన్న యిల్లు. చాలా హాయిగా వుంటూ తిరుగుతుంటాడు. నల్లని ఎలుగుబంటి ఒకటి వెంట పడుతుంది. అతడు పట్టించుకోడు. నవ్వుతూ, తుళ్ళుతూ, ఈలలు వేసుకుంటూ, తన వంకెకర్ర తిప్పుకుంటూ, తప్పటడుగులు వేసుకుంటూ పోతుంటాడు. మంచుకొండలు విరిగి పడుతూంటే భయపడి దూకితే లోయలో పడిపోయి తన వంకెకర్ర మీద ఆధారపడతాడు. అప్పుడొక పటం (Map) తీసి చూస్తాడు. ఆ పటంలో అన్నీ ఎక్కడెక్కడ ఏవేవి వున్నవో వ్రాసి వుంటాయి. తర్వాత సన్నివేశంలో మంచులో గుడారం, బయట మంచు తుఫాను, లోపల చార్లీ, బిగ్‌జిమ్, మాకే, బ్లాక్ లార్సెన్. గుడారం బ్లాక్ లార్సెన్‌ది. మిగతా యిద్దరూ-తుఫాన్ తప్పించుకోటానికై లోపలికి బలవంతంగా దూరుతారు. వీరిద్దరినీ, బయటికి పంపాలని లార్సెన్. ఆ గుడిసెలో జరిగిన భయంకర, వినోదకర, కరుణాత్మక దృశ్యాలన్నింటినీ చూడవలసిందే కాని వ్రాయటానికి మాటలు చాలవు. బయట భయంకరమైన తుఫాను. లోపల

ముగ్గురిలో ఒకరంటే ఒకరికి భయం. తాను చాలా భయపడుతూనే మిగతా యిద్దరినీ నవ్వించాలని రకరకాల ప్రయత్నాలు చార్లీ చేస్తుంటాడు. అంతలో ఒక కుక్క వచ్చి పక్కనే పడుకుంటుంది. అందరిలో ఆకలి, ఒకళ్ళ నొకళ్ళు దీనంగా, భయంగా చూసుకుంటూ వుంటారు. లార్సెన్ దగ్గర తుపాకి వుంటుంది కాని యిద్దరూ కలిసి చంపేస్తారేమోనని భయం. ఇంతలో కుక్కవున్న గదిలోకి బిగ్‌జిమ్ వెళ్ళి బయటకువస్తూ పళ్ళుకొరుక్కుంటూ వుంటాడు. కుక్కని చంపేసి తింటున్నాడని చాప్లిన్ వూహిస్తాడు. బయటికెవరు వెళ్ళిపోవాలన్న విషయంలో పేక ముక్కలు వేస్తారు. లార్సెన్ పోవలసివస్తుంది తరువాత లార్సెన్‌ను బయట పోలీసులు చంపేస్తారు. ఇక గుడారంలో వుంది యిద్దరు. ఒకడు బిగ్‌జిమ్ పెద్ద ఎలుగుబంటిలా భయానక విగ్రహం మరొకడు చార్లీ బక్కగా, తిక్కగా మానవ వినోదకారి తుఫాను భయంకరంగా మారుతుంది ఆకలి కూడా అంతే. ఆకలిని తీర్చుకోటానికి ఒక బూటుని ఉడకబెడ్తాడు చాప్లిన్ చాలా బాగా వండుతాడు. చాకు పోర్కుతో ఉడకబెట్టిన బూటుని టేబుల్‌మీద పెట్టి బూట్ లేస్‌లను, పై భాగాన్నీ చాలా చక్కగా విడదీస్తాడు. చాలా మంచి వాసన వేస్తున్నదని తృప్తి చెంది బిగ్‌జిమ్‌ని బూట్ క్రింది భాగాన్ని (Sole) తినమంటాడు. బూట్‌కున్న మేకులు చాలా చక్కగా నాకుతాడు. తరువాత కట్టెపుల్లలకై చాప్లిన్ బయటకు పోతాడు. యింకొక బూటు వుడుకుతూ వుంటుంది. అంతే బూట్లు లేకుండానే మంచులో బయటికెడతాడు. గుడ్డలు చుట్టుకొని, వట్టి చేతులతో తిరిగొచ్చి డిన్నర్‌కి ఏర్పాట్లు చేస్తాడు. డిన్నర్ మధ్యలో బిగ్‌జిమ్‌కి దాదాపు పిచ్చెక్కుతుంది. ఆకలితో చాప్లిన్‌ని పెద్దకోడిగా వూహిస్తాడు. అపుడు మొదలవుతుంది భయానక దృశ్యం - చార్లీని చంపాలని చూస్తాడు బిగ్‌జిమ్ - కోడి మెడకాయ కోసినట్లుగా చాప్లిన్ మెడ బిగ్‌జిమ్ చేతిలో, అపుడు చూడాలి, చాప్లిన్ యాక్షన్. ఒకరినొకరు తప్పించుకోవాలని ఆ గదిలో గుండ్రంగా టేబుల్ చుట్టూ తిరుగుతారు. ఎలాగో చాప్లిన్ బయటపడతాడు. బిగ్‌జిమ్ తుపా^ తీసుకొని చాప్లిన్ వెంటబడతాడు, కాలుస్తాడు ఎగురుతున్న రెక్కలు కనబడతాయి. చాప్లిన్ చేతులవి !

తర్వాత పక్కనే ఉన్న పట్టణంలో తేలుతాడు చాప్లిన్ అక్కడ క్లబ్బులో క్యాబరే డాన్సరైన జార్జియా హేల్‌తో ప్రేమలో పడతాడు. ఆమె ఎవరినో చూచి చిరునవ్వు నవ్వుతుంటే తననే చూస్తుందని చార్లీ ! తనని కాదని తర్వాత తెలుసుకొని పాపం చాలా బాధపడతాడు ! తాగుతాడు. తనని తాను ఓదార్చుకుంటూ చాలా ఒంటరిగా యింటికొస్తాడు. తర్వాత జార్జియా మంచులో తన మిత్రులతో ఆడుతూ, ఒక

మంచు బంతి విసిరేస్తే, అదృష్టవశాత్తు చాప్లిన్ ముఖానికి తగులుతుంది. వారిని లోపలికి ఆహ్వానించి తాను కట్టెలకై బయటకెళ్ళినపుడు జార్జియా తన ఫోటోను చాప్లిన్ దిండులో చూస్తుంది తర్వాత నూతన సంవత్సరాది ఉత్సవాలకు ఆమెను విందుకు పిలుస్తాడు ఆమె వస్తుందనుకుంటాడు. అన్నీ బ్రహ్మాండంగా తయారుచేస్తాడు కొన్ని కానుకలు కూడ తెచ్చి ఉంచుతాడు ఎంతో నిరీక్షించిన తర్వాత, వస్తారా ? రారా ? వస్తానన్నారా ? రారేమో ? ఎన్నో ప్రశ్నల మధ్యలో చాప్లిన్ తనొక్కడే నవ్వుతుంటాడు. అనేక రకాల నటనలు చేస్తుంటాడు. ఎలాగైతేనేమి వాళ్లు వస్తారు జార్జియా మిత్ర బృందం వారికి రాచమర్యాదలన్నీ చేస్తాడు రెండు రొట్టె (Bread) ముక్కలతో డ్యాన్సు చేయిస్తూ, తానూ డ్యాన్సు చేస్తాడు రొట్టె ముక్కల డ్యాన్సు అద్భుతంగా ఉంటుంది. అందరూ సంతోషంగా విందారగిస్తారు. చాప్లిన్ చాలా సంతోషిస్తాడు. అయితే చివరకు మళ్ళీ ఒంటరిగానే మిగిలిపోతాడు ! ఇదంతా కల ! వాళ్ళు రాలేదు ! వచ్చారనుకొని ప్రదర్శన భగ్న ప్రేమికుడిలా, పిచ్చాడులా, ఎంతో భారంగా చీకటి గదులలో తచ్చాడుతూ ఉంటాడు వాళ్ళు కనపడతారేమోనని ! విడిపోయిన స్వర్గం మళ్ళీ కనపడుతూంది! కొత్త సంవత్సరపు ఉత్సవాలు, డ్యాన్సులు జరుగుతూ ఉంటాయి. ఆనంద డోలికలు, డ్యాన్సు చేస్తూ జార్జియా కనపడుతుంది. చిన్న పిల్లాడిలా, ఓడిపోయినవాడిలా తిరుగుతూ ఉంటే, అపుడు గుర్తుకొస్తుంది జార్జియాకి తను చాప్లిన్ కిచ్చిన వాగ్దానం. ఆమె చాప్లిన్ ఇంటికి పోతుంది. చాప్లిన్ ఉండడు హృదయాలు పగిలిపోతాయి ప్రేమ భగ్నమవుతుంది. ఎంతో విచారంతో ఇంటికిపోతాడు చాప్లిన్. అక్కడ బిగ్‌జిమ్‌తో భయంకరంగా పోట్లాడిన రోజుకు, బిగ్‌జిమ్ కొంత బంగారాన్ని సంపాదించి గుడారంలో ఉంటాడు. మళ్ళీ చాప్లిన్, బిగ్‌జిమ్, మంచుతుఫాను. బయట తుఫానుకు గుడిసె కొట్టుకుపోయి వొక కొండ శిఖరాగ్రం నుండి క్రిందికి వంగుతుంది. వొక త్రాడుపై వేలాడుతుంది, లోపలవాళ్లకు తెలియదు. తరువాత ఆ గుడిసె వూగుతూ ఉండటం చూసి, భయాందోళన చెందుతారు. ఆ దృశ్యం మళ్ళీ చూడాల్సిందే. చాప్లిన్ సాహసాలు ఎలాగైతేనేం బయటపడి, లార్సెన్ బంగారంతోపాటు అమెరికాకు బయలుదేరుతాడు నౌకలో. అదే నౌకలో దూరంగా జార్జియా. వొక ట్రిక్‌తో క్షణంలో ఆమెను తన పక్కకు వచ్చేటట్లు చేస్తాడు. ఆనందం! ఆలింగనాలు ! తుఫానులో చిక్కుకొన్న అనాధలకు వొకరికొకరు ఆసరా !

గోల్డ్‌రష్ చిత్రం శుద్ధ హాస్య వినోదాన్ని కలిగించేది అయితే చాప్లిన్ ఈ చిత్రాన్ని వినోద చిత్రాలలో శాశ్వతంగా ఉండేటట్లు తీశాడు. గుండ్రని ముఖంగల

జార్జియా, చతురస్రమైన గుడిసె, నల్లని 'V' ఆకారంలో మాక్ స్వేయిన్ అంచులు, రొట్టెలడ్యాన్సు నెత్తురు వోడుస్తున్న హృదయాలకు ప్రతీకలుగా భావించవచ్చు ఈ చిత్రం తీయటానికి చాప్లిన్ రేఖాగణితం, ఆల్‌జిబ్రా సిద్ధాంతాలను వినియోగించాడు! (ఈ ఆల్‌జిబ్రా సిద్ధాంతాన్ని తెలుసుకోవాలంటే రాబర్ట్ ఫేన్, 'ది గ్రేట్ చార్లీ' పాన్ బుక్స్ చదవండి) ప్రపంచంలో వున్న హాస్యాన్నంతా ఈ చిత్రంలో కుమ్మరించాడనవచ్చు !

ఐజినిస్టీన్, రష్యన్ సినీ దర్శకుడు తీసిన "ఐవన్ ది టెర్రిబుల్ " చిత్రం చూచిన తర్వాత చరిత్రను కావ్య రూపంలో చాలా గొప్పగా చిత్రీకరించాడనుకుంటాడు చాప్లిన్. ఇటీవల జరిగిన చారిత్రక వాస్తవాలను కూడా చరిత్ర గ్రంథాలలో ఎలా తారుమారు చేశారో చూచిన తర్వాత ఆ గ్రంధాలమీద అనుమానం కలుగుతుందంటాడు అందుకనే చరిత్ర సత్యాలను తెల్సుకోవాలంటే కళాకారుని కళాత్మక సృష్టిలోనే దొరుకుతాయి కాని చరిత్ర గ్రంథాలలో మాత్రం దొరకవని చార్లీ అభిప్రాయపడతాడు.

## "ది సర్కస్" (The Circus)

గోల్డ్‌రష్ తర్వాత రెండున్నర సంవత్సరాలకు "ది సర్కస్" చిత్రాన్ని 1928 లో తీశాడు చాప్లిన్ తీసిన నేడు ప్రసిద్ధ క్లాసికల్ చిత్రాలలో "ది సర్కస్" ఒకటి, సోల్జర్ ఆర్మ్స్, ది కిడ్, ది పిల్గ్రిమ్, ది గోల్డ్‌రష్, సిటీలైట్స్ మన్స్యువెర్డు మిగతా క్లాసికల్స్ ఇది అన్ని చిత్రాలకంటే హృదయవిదారకమైంది (Coldest) అన్ని చిత్రాల మాదిరిగా కాకుండా ఒకే ప్రదేశంలో ఒకే కాలంలో ఒకే కథను ప్రదర్శిస్తుంది. అసలే కథలేదు చార్లీ చిన్నపుడు సర్కస్‌లో చేరాలనుకునేవాడు కొంతకాలం ట్రపేజ్ ఆర్టిస్టు (దొమ్మరి ఆటగాడు) గా పని చేశాడు. కాని ఒకసారి కిందపడటంతో వదిలిపెడతాడు. కనుక సర్కస్‌లో వున్న అందరి హాస్యగాళ్ల కంటే తాను గొప్పగా చేసి యింతకుముందు చేయనిదాన్ని చేసి తన సర్కస్ కోర్కెను తీర్చుకుంటాడు. అన్ని చిత్రాలలో మాదిరిగా కాక సర్కస్‌లో బ్రహ్మాండమైన సెట్టింగ్స్ వేశాడు. సర్కస్ టెంట్‌లోకి చాప్లిన్ ఒక సంఘటన ద్వారా ప్రవేశిస్తాడు. (పోలీసులు తన వెంట వస్తూంటే) సర్కసులోనే వుంటూ అతిసాహసమైన టైట్‌రోప్ వాకింగ్ చేస్తాడు. కథేమిలేదు. కాని సర్కసులోనే వుంటూ సర్కస్ పిల్లను ప్రేమిస్తాడు (అయితే ట్రాంప్‌ని ఎవరు ప్రేమిస్తారు !). సర్కస్ డ్యాన్సర్‌తో ప్రేమింపబడలేక డ్యాన్సర్

ప్రేమించినవానితో పెళ్ళి చేస్తాడు. సర్కస్ కంపెనీ అక్కడనుండి తరలిపోయింది మన చాప్లిన్ తెల్లముఖంతో వెనక మిగిలిపోతాడు. మళ్ళీ ఒంటరిగా ! భగ్న ప్రేమికుడిగా !

సినిమాలో ఒక దృశ్యం తరువాత మరొకటి చాలా వేగంగా మారుతూ, అతి సాహసమైన, భయంకొల్పే సన్నివేశాలు వస్తుంటాయ్. ప్రేక్షకులు హాస్యాన్ని ఆనందిస్తూ వుంటారు సాహసమైన పనులు చేసేటపుడు ఒంట్లో గుబులు, చలి కలిగి బిగుసుకు పోవటం జరుగుతుంది. అయితే సర్కస్ చిత్రంలో చార్లీ వూహాగానాలు, భావప్రపంచాలు లేవు-వాస్తవ ప్రపంచాన్నే వున్నదున్నట్లుగానే తాను చూచినట్లుగానే చూపిస్తాడు.

## "సిటీలైట్స్" (City Lights)

సిటీలైట్స్ చిత్రం తీసేనాటికి అమెరికా చిత్ర జగత్తులో చాలా మార్పులొచ్చాయి. శబ్ద చిత్రాలు వచ్చాయి. కాని చాప్లిన్ మట్టుకు మూకీ చిత్రాలే తీయాలనుకుంటాడు. టాకీల ద్వారా అన్నిరకాల వినోదం, తన మూగపాత్రకు సాధ్యం కాదనుకుంటాడు. అందుకని ధైర్యంచేసి "సిటీలైట్స్" మూకీ చిత్రంగానే తీశాడు చాప్లిన్ సాహసానికి అందరూ ఆశ్చర్యపోతారు. అయితే సంగీతానికి అదనంగా వేరే శబ్దాలు కూడా ప్రవేశపెట్టాడు "సిటీలైట్స్" చిత్రం అన్ని చిత్రాలకంటే గంభీరమైంది, లోతైంది, అది బాహ్యంగానే కన్పడుతుంది. హాస్యం శిఖరాలను చేరుకుంది హాస్యంలో వున్న హింసను నిరాశనుండి కాపాడడానికి చాప్లిన్ ఎంతో కృషిచేసి ధన్యుడవుతాడు.

సిటీలైట్స్ చిత్ర నిర్మాణం ఆఖరు దశలో వుండగా, జీవితంలో అత్యమితంగా ప్రేమించిన చాప్లిన్ తల్లి అక్టోబరు 1928 లో చనిపోయింది. చాలా బాధపడతాడు. అంతకుముందే సర్కసుతీసి చాలా అలసిపోయివుంటాడు. తరువాత సిటీలైట్స్ చాలా శ్రమపడి తీయవలసి వస్తుంది. తన జీవితంలో పడ్డ కష్టాలు,బాధలు కొన్నిచోట్ల చిత్రంలో కనిపిస్తాయి. సిటీలైట్స్ కథ చాప్లిన్ మనస్సులో ఎప్పటినుండో మెదులుతూ ఉంది. తల్లి చనిపోయినందుకు విచారం, చిత్రం తీయవలసిన బాధ్యతని ఛాలెంజిగా తీసుకొన్నాడు. సంగీతం ద్వారా చిత్రాన్నెక్కువగా తీయాలనుకున్నాడు.

చిన్నతనం నుండే సంగీతం పట్ల అభిరుచి ఉంది. తరువాత సంగీతం నేర్చుకున్నాడు. తరువాత చిత్రాలకు సంగీతాన్ని తానే సమకూర్చుకునే సమర్థత సాధిస్తాడు. ఆవిధంగా చిత్ర నిర్మాణానికి కావలసిన ప్రధాన పాత్రధారి, దర్శకుడు,

నిర్మాత, కథకుడు, (కథకూడా తన జీవితానికి సంబంధించిందే!) సంగీత దర్శకుడు అన్నీ తానే అయ్యేందుకు సామర్థ్యాన్ని సంపాదిస్తాడు సిటీలైట్స్ చిత్రం విజయంపై తన జీవితం ఆధారపడివుంది. శబ్ద చిత్రాలు చాప్లిన్ తీయలేడని, చిత్ర నిర్మాణంలో చాలా వెనుకబడినవాడుగా పుకార్లు పుట్టాయి. అయితే ఆ 'మూగ' మాట్లాడలేడు అలాగని తనకు తగిలిన గాయాలను ఎవరికీ చూపించకుండా వుండాలేడు !

శబ్ద చిత్రాలు, టాకీలు వచ్చినందుకు విచారించాడు. శామ్ గోల్డ్‌విన్‌తో మొరపెట్టుకుంటాడు. "టాకీ చిత్రాలు నన్ను మాట్లాడమని బలవంతపెడ్తున్నాయ్. కాని నేను మాట్లాడను ! నేను మాట్లాడను ! ఒక వేళ సిటీలైట్స్ మటుకు విఫలమయితే యింతకు ముందు తగిలిన గాయాలకంటె, జీవితంలో మరెప్పుడూ తగలని వాటికంటే చాలా లోతుగా తగిలిందనుకుంటాను" అంటాడు.

సిటీలైట్స్ చిత్ర నిర్మాణానికి నెలలు, సంవత్సరాలు నిర్విరామకృషి చేశాడు. మొదట కలిగిన భావాలు, సన్నివేశాలు, దృశ్యీకరణ కొంత మార్చాడు. 1915 నుండి వేస్తున్న ట్రాంప్ పాత్ర ప్రప్రథమంగా 1931లో మారి కొత్త ధోరణులను సంతరించుకొంది. తనకున్నవి కాక అదనంగా కొత్త గుణాలను తెచ్చుకుంది. అసాధ్యమైన వాటిని ఆహ్వానిస్తుంది. ట్రాంప్ పాత్ర విషాదం మరింత పదును పెట్టుకుంది. మరణానికి దగ్గరవుతుంది. ఆత్మహత్యకు పాల్పడుతుంది. తననుకున్నట్లు ఈ జగత్తులో జరగకపోతే, లోకానికే తాను దండగ అని నిరాశ చెందుతాడు. కాని ఈ జగత్తునే పట్టుకొని వదలకుండా చివరి నిమిషం వరకు వేచి ఉంటాడు ఎవరి బిక్షను అర్థించకుండా, ఎవరిమీద ఫిర్యాదు చేయకుండా, అభాగ్యులందరికీ తోడ్పడుతూ, తనలో వున్న చివరి హాస్యపు తునకని కూడ వారికి అందిస్తాడు. పిరికివాళ్ళు చీకట్లో ఈలలు వేస్తూ, చీకట్లోనే తాము చేయవలసిన మంచి పనులున్నాయనుకుని, చివరి దశలో అంధకారానికి తమ్ము అర్పించుకుంటారు. యుగయుగాలుగా ఈ లోకంలో పెంచుకొని వస్తున్న నికృష్ట బాధలు తొలగవు, తొలగింపబడనివి అని విశ్వసిస్తాడు. కాని దొరికిన కొద్ది కాలంలో, జీవించటానికి ప్రయత్నించి మానవ ప్రయత్నాన్నీ, అత్యంత ధైర్య సాహసాలను ప్రదర్శించి, భయంకర ఉత్సాహంతో వీరోచిత పోరాటాలను కావించి వీరాధివీరుడుగా మిగిలిపోతాడు. తాను చేయవలసింది చేయగలిగినంత చేస్తాడు. జయాపజయాలను గురించి పట్టించుకోడు. నిర్దిష్టమైన కొన్ని నియమాల ననుసరించి నడుస్తున్న ఈ విశ్వంలో అవసరమైన వాటికి ప్రాముఖ్యం ఇవ్వడు.

ఈ ఆలోచనలతో ముడిపడి వుంది సిటీలైట్స్ చిత్రం.

సిటీలైట్స్ చిత్రం కథ విచిత్రమైంది. చార్లీ చాప్లిన్ స్వీయ చరిత్ర ప్రకారం ఈ విధంగా వుంటుంది సిటీలైట్స్ చిత్రం 'మానవ స్పృహాశక్తికి కొలబద్ధ.' ఒక పర్కస్ బఫూన్ ప్రమాదవశాత్తు కళ్ళు పోగొట్టుకుంటాడు మానసిక రోగంతో వున్న తన కూతురుకు ఈ విషయం తెలిస్తే చాలా ప్రమాదమని డాక్టర్లు చెప్తారు. కనుక తన అంధత్వం విషయం ఆ పిల్లకు తెలియకుండా వుంచాలి. ఇది చాలా కష్టమైన పని అయినా బఫూన్ అసలు విషయం తెలియనీయకుండా తన సహజ ధోరణిలో గంతులు వేస్తూ ఆ పిల్లను వినోద పరుస్తూ వుంటాడు. సిటీలైట్స్‌లో చాప్లిన్ తాను ట్రాంప్‌గా నటిస్తూ అంధత్వం ఆ పిల్లకు ఆపాదిస్తాడు. దీనికి కారణం వుంది. తాను ఎన్నో సంవత్సరాలుగా అనుకుంటున్న ఒక విషయాన్ని పరీక్షించటమే!

సంపన్నుల క్లబ్బులో వున్న ఇద్దరు ధనవంతులు మానవ చేతన యొక్క అస్థిరత్వాన్ని (Instability of Human Consciousness) పరీక్షించాలనుకుంటారు. ఆ ప్రయోగం కొరకై వీధిలో పడుకొన్న ఒక దేశ దిమ్మరిని (ట్రాంప్) దీర్ఘ నిద్రలో వుండగా తమ బంగళాకు తీసుకుపోయి, లేపి, బాగా త్రాగించి, తినిపించి, స్త్రీలతో సాంగత్యం సాగనిచ్చి, ఆట పాటలలో ముంచి తేల్చి, చిత్తుగా, మత్తుగా బాగా తాగి, మళ్ళీ గాఢ నిద్రలోకి పోయినపుడు వాడిని ఎక్కడ నుండి తీసుక వచ్చారో అక్కడే మళ్ళీ వదిలిపెట్టి వస్తారు. ట్రాంప్ తాను నిద్ర నుండి మేల్కొన్నప్పుడు తాను అనుభవించినవి గుర్తుకు వచ్చి అదంతా కల కాబోలు ! అని సర్ది చెప్పుకుంటాడు. ధనవంతులు తిరుగుబోతుతో తాగినపుడు స్నేహితులుగా వుంటారు. మామూలుగా వున్నప్పుడు పట్టించుకోరు ! ఈ భావన మీద తీసింది " సిటీలైట్స్". దీనిలో అంధ బాలను తిరుగుబోతు అయిన తాను చాలా ధనవంతుడని నమ్మిస్తాడు. ఆ పిల్లకు ఎలాగైన దృష్టి తెప్పించటానికై ధన సంపాదన చేయాలని విశ్వప్రయత్నం చేస్తాడు.

సిటీలైట్స్‌లో నిజంగా చెప్పాలంటే ఒక కథ కాదు దాదాపు ఏడెనిమిది కథలున్నాయి - ఒక దానితో యింకొక దానికి సరైన సంబంధం లేకపోయినా సంబంధం వున్నట్లే ఒక వరుసలో తీశాడు. ఈ సినిమా తీయటానికి రెండేళ్ళకు పైనే పట్టింది. ఎంతో కష్టపడి, ఎందరినో నటీనటులను, ఫోటోగ్రాఫర్లను, సంగీత దర్శకులను కష్టపెట్టాడు. చాప్లిన్ దగ్గర పనిచేయలేక కొందరు వెళ్ళిపోతారు. ఎంత కష్టపడ్డా సమగ్రత (Perfection) చేకూరలేదని అనుకుంటూ ఉండేవాడు. అలాగని, 80,000 అడుగుల చిత్రాన్ని తీశాడు. చివరికి మిగిలింది 20 లక్షల

డాలర్ల వ్యయం, 9,000 అడుగులతో 87 నిమిషాల పాటు జరిగే ప్రదర్శనా ! ఈ చిత్రాన్ని కొనటానికి పంపిణీదారులు ముందుకెవరూ రారు. పైగా న్యూయార్కులో ఈ చిత్ర ప్రదర్శనకు ఏ హాలు ఖాళీ లేదన్నారు ! చివరికి న్యూయార్కులోనే ఒక చెత్త హాలుకు కొన్ని రెట్లు అద్దె ఎక్కువ యిచ్చి పందెంగా తన స్వంత ఖర్చుతోనే నడపాలనుకుంటాడు. కాని యింతలోనే లాస్ ఏంజిలిస్ లో కొత్తగా నిర్మించిన ఒక సినిమాహాలు అద్దెకు తీసికొని సిటీలైట్స్ విడుదల చేశాడు అక్కడే వుంటున్న ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్ తో (అప్పటికే చాప్లిన్‌తో బాగా పరిచయముంది) సిటీలైట్స్ ప్రారంభిస్తారు ఆఖరి సన్నివేశానికి వచ్చేటప్పటికి ఐన్‌స్టీన్ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కన్పిస్తాడు! శాస్త్రవేత్తలు మానసికంగా చాలా బలహీనులని మరొకసారి ధృవపరచాననుకుంటాడు చార్లీ చివరికది నాలుగు లక్షల డాలర్లు సంపాదిస్తుంది

సిటీలైట్స్ కథ యిది ! ఈ చిత్రంలో ట్రాంప్ మరీ పనిలేని తిరుగుబోతు కాదు, మధ్యతరగతికి చెందిన పెద్ద మనిషి బ్యాంకులో గుమాస్తా పనిచేస్తూ, వుద్యోగాన్ని పోగొట్టుకుంటాడు పనికోసమై అన్వేషిస్తూ వుంటాడు సిటీలో రకరకాల చిన్న చిన్న పనులుచేస్తూ వుంటాడు ఎన్నో హాస్యపు పనులుచేస్తూ వుంటాడు. ఒకసారి ఒక పోలీసు నుండి తప్పించుకోవటానికై పార్కు చేసివున్న ఒక పెద్ద కారువద్ద నిలబడివుంటే పూలమ్ముకునే అంధబాల చాప్లిన్ దగ్గరకు వచ్చి కారు స్వంతదారు అనుకుంటుంది చాలా ధనవంతుడనుకొంటుంది. దానికి తగ్గట్టు చాప్లిన్ తన దగ్గరవున్న ఒక నాణేన్ని ఆమెకు పోకూగా యిచ్చేస్తాడు ఆమె చాలా అందంగా వుంటుంది. ఆమె అందానికి ముగ్ధుడై వలపు వూహల్లో బందీ అవుతాడు. కాని ఆమె అంధురాలని వెంటనే తెలుసుకొంటాడు. తరువాత ఆమెను తన యింటిలో దించుతాడు.

అంధ పూలబాల కలవక ముందు చాలా నిరాశా, నిస్పృహలతో బ్రతుకును భారంగా, విషాదంగా లాగుకొస్తున్న వాడల్లా పూలబాల కలవడంతో ఆమె దగ్గర నుండి తెచ్చిన తెల్ల గులాబీతో చిగురించిన జీవితాశలతో కన్పిస్తాడు. ఆమె ప్రేమను పొందాలనుకుంటాడు - ఇప్పుడు చనిపోవాలన్న ఆలోచనలు లేవు - బ్రతకాలని నిర్ణయించుకుంటాడు - ఈ దృశ్యాలలో ముందు అనుకొన్నది -

ఒక రోజు సాయంత్రం ట్రాంప్ థేమ్స్ నది ఒడ్డున సిమెంట్ బల్లమీద కూర్చొని సిటీలైట్స్ కాంతులు ఒక ప్రక్కచూస్తూ, మరొకవంక థేమ్స్ నదిలో నల్లగా కనపడుతున్న నీళ్ళను చూస్తూ చాలా విచారంగా వుంటాడు-ఇంతలోనే ఒక పెద్ద

ఆకారపు ధనవంతుడు బాగా త్రాగి చావాలని ప్రయత్నిస్తుంటాడు - ఒక పెద్ద బండకు త్రాడుకట్టి ఆ బండను నీళ్ళలోకి వేసి తాడు రెండవ కొసను తన మెడకు చుట్టుకొంటాడు. చాప్లిన్ అతనిని చావునుండి తప్పించాలని ప్రయత్నించి, బ్రతకటంలో మాధుర్యం వుందని ఒప్పించి అతనిని చావు ప్రయత్నం నుండి విరమింపజేసినందుకు ధనవంతునికి చాప్లిన్ ఆప్తమిత్రుడౌతాడు చాప్లిన్‌కి తిండి, తాగుడు అన్నీ యిస్తాడు-చార్లీ యిచ్చిన ఆలోచనలకు ధనవంతుడు తాగిన మత్తులో చాప్లిన్‌కి కొంత డబ్బు, తన కారును యిచ్చేస్తాడు. దాంతో అంధ పూలబాల దగ్గరున్న పూలన్నీ కొనేస్తాడు - తాను లక్షాధికారినని ఆ పిల్ల భావించేటట్లు ప్రవర్తిస్తాడు. కారులో ఆమెను యింటి దగ్గర దిగబెడతాడు-కాని తెల్లవారి మత్తుదిగిపోగానే లక్షాధికారి తన కారును తాను తీసుకుంటాడు అయితే మరొకసారి చాప్లిన్ గౌరవార్థం విందు యిచ్చి మళ్ళీ పూటుగా త్రాగుతాడు లక్షాధికారి ఆ పార్టీలో చాప్లిన్ ఒక బొమ్మ విజిల్‌ని మింగేస్తాడు మత్తు వదలగానే చాప్లిన్‌ని బయటికి గెంటేస్తాడు. ఈ గొడవల్లో, తాను లక్షాధికారిగా ప్రవర్తిస్తూ, గుడ్డిపిల్లను నమ్మించాలి. ఇంతలోకే ఆమెకు జబ్బు చేస్తుంది ధన సంపాదనకై వీధులు వూడ్చేవాడుగా, బాక్సింగ్ వాళ్ళతో పోటీలు, అక్కడ బాగా మందు పట్టించి వున్న లక్షాధికారి కన్పడి, అంధబాల కళ్ళు ఆపరేషన్‌కై డబ్బుయిస్తాడు - కాని చాప్లిన్ ఆ డబ్బును దొంగిలించాడని పోలీసులు పట్టుకొని జైలులో వేస్తారు. దొంగసొమ్ము కాదని నేనే యిచ్చానని లక్షాధికారి చెప్పడు-అయితే డబ్బు మట్టుకు ఆ పిల్లకు చేరుతుంది. ఆమెకు దృష్టి వచ్చిన తర్వాత తనను గురించి ఏమనుకుంటుందోనని చాప్లిన్‌కి భయం! ఆందోళన!

జైలునుండి విడుదలవుతాడు చార్లీ ఆమె తన మిత్రునికొరకై ఎదురుచూస్తుంది. అప్పటికే ఆమెను అదృష్టం వరించింది. ధనవంతురాలవుతుంది. దరిద్రంతో ఆమెకొరకు వెదుతూ వీధులన్నీ తిరుగుతుంటాడు చార్లీ. ఆమె కనపడుతుంది. తానెవరో ఆమెకు తెలియదు. కాని తాను పరిచయస్తుడిలా ఆమె వంక తేరిపార చూస్తాడు. ఆమె ఆశ్చర్యపడి చూస్తుంది. అతని చేతికి ఒక పువ్వును ఇచ్చేటప్పుడు కాకతాళీయంగా ఆమె చార్లీని తాకుతుంది. ఆ చిన్న తాకిడికే చార్లీ ఎవరో ఆమె తెలుసుకుంటుంది! ఆమె గుర్తింపుదృశ్యం అంతులేని కరుణ, దయ, సానుభూతిని కురిపిస్తుంది. ఇద్దరూ ఒకళ్ళకెదురుగా ఒకరు నిల్చుని కలసి ఉంటారు. ఒకళ్ళ కళ్ళళ్ళోకి యింకొకరు చూచుకుంటూ, ఆ దృశ్యం అలా నెమ్మదిగా అంతమవుతుంది. అయోమయమైన పరిస్థితుల్లో తనకు తెలిసిన ఘోర సత్యాన్ని

తట్టుకోటానికి ప్రయత్నిస్తూ ఆమె, ఆమె తనకిక దక్కదేమోనన్న అనుమానపు నిరాశలమధ్య చార్లీ - గులాబీ పుష్పాన్ని చేతిలో తిప్పుకుంటూ !

చిత్రంలో మొదటి నుండి గులాబి పువ్వును కోటుకు ధరిస్తాడు చార్లీ! లేకపోతే చేతిలో వుంచుకొని త్రిప్పుతూ వుండేవాడు చివరి క్షణంలో కూడా వర్జీనియా చెర్రిల్ (అంధబాల) వైపు పిచ్చిగా చూస్తూ తన చేతిలోని పూవును త్రిప్పుతుంటాడు. ఆ పువ్వు రహస్యమేమిటో తెలియదు. అయితే కోల్‌రిడ్జ్ మహాకవి భావన ఈ హాస్య విచ్ఛేదన మార్గం తెల్పుతుంది. కలలో ఎవరైనా స్వర్గారోహణ చేసినప్పుడు, అక్కడ ఎవరైనా ఒక పువ్వును అందించినట్లయితే అది తన ఆత్మ స్వర్గానికి చేరుకుందని తెలుపటానికి చిహ్నం ! అయితే కల చెదిరి చూసేసరికి ఆ పువ్వు తన చేతిలోనే వుంది ! అప్పుడేమనుకోవాలి? తుర్కు భాషలో ఇస్లామిక్ సంస్కృతిలో ఎవరైనా మరణించినపుడు గులాబి పూలగుచ్ఛాలతో మరణించిన వానిని స్వర్గానికే సాగనంపుతారు ! అపుడు గులే ! గులే లేక గుల్ గులే అని అంటారు. చార్లీ చేతిలోని పూవుకు ఇదే సమాధానమా ?

## యూరప్ పర్యటన

సిటీలైట్స్ విజయం సాధించటంతో లండన్‌లో సిటీలైట్స్ విడుదల చేశాడు ఈ సారి యూరప్ పర్యటన బయలుదేరాడు. మరొక పదేళ్ళ తరువాత లండన్ వెళ్ళాడు. లండన్‌లో గొప్పవాళ్ళయిన జార్జి బెర్నార్డ్‌షా, జన్‌కీన్స్ లాయిడ్ జార్జి, లేడీ యాస్టర్, ప్రధానమంత్రి రామ్ సెమాక్డోనాల్డ్, విన్‌స్టన్ చర్చిల్, మహాత్మాగాంధి మొదలైనవారితో విందులు, సంభాషణలు జరిపాడు

లండన్‌లో గాంధీని కలిసి భారత స్వాతంత్ర్యానికి మద్దతు తెల్పుతూ, యంత్రాలను ఎందుకు వ్యతిరేకిస్తున్నారో అర్థం కావటం లేదని అడిగితే గాంధీ తన పథకాన్ని వివరించి చెప్పాడు. తెల్లవాడు భారత దేశాన్ని వదిలి పెట్టేటట్లు, చేయాలంటే యంత్రాలతో తయారయే వుత్పత్తిని కొనుగోలు కాకుండా చేస్తేనే సాధ్యమవుతుందని గాంధీ తెలుపుతాడు గాంధీ నాయకత్వాన్ని, ఆయన సామాన్యత్వాన్ని మెచ్చుకుని గాంధీతో ప్రార్థనలో పాల్గొన్నాడు చార్లీ

లండన్‌లో సిటీలైట్స్ చిత్రం ప్రారంభోత్సవంనాడు జోరున వర్షం అయినా సినిమా చూడడానికి చాలా మంది వచ్చారు. సినిమాహాలులో బెర్నార్డ్‌షా ప్రక్కన కూర్చుంటే అందరూ విరగబడి నవ్వుతారు. ఇద్దరూ నిలబడి చేతులూపితే మళ్ళీ

పగలబడి నవ్వుతారు చర్చిల్ కూడ ఆ చిత్రాన్ని చూసి చార్లీని అభినందిస్తాడు

ఆ తర్వాత కొంతమంది రాజకీయ నాయకులతో చర్చిస్తూ రాజకీయాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు. బ్రిటన్‌లో ఏ పార్టీ పదవిలోకి వచ్చినా రాజరికానికి సేవచేయటమేనని తెల్సుకొని ఆశ్చర్యపోతాడు లండన్‌లో మేధావులతో జరిపిన సంభాషణలు, అనుభవాలు చాలా గొప్పగా ఉన్నాయి. హెచ్.జి.వెల్స్‌తో రష్యాను గురించి, అమెరికా రాజకీయాలను గురించి చర్చిస్తాడు

లండన్ నుండి పారిస్, స్పెయిన్, వియన్నా, వెనీస్, బెర్లిన్ నగరాలకు ఎందరో ఆహ్వానిస్తే వెళ్ళి వాళ్ల గౌరవాభిమానాలు, మన్ననలను పొందుతాడు. ఈ యూరప్ పర్యటనలో రాజకీయంగా చాలా అనుభవాన్ని పొందుతాడు.

యూరప్‌లో అనేక ప్రదేశాలు తిరిగి తిరిగి అలసి అమెరికాకు వచ్చాడు ఒక నిర్దిష్టమైన లక్ష్యం లేకుండా యూరప్‌లో ఎందుకు అన్ని దేశాలు తిరిగానని తానే ప్రశ్నించుకొని, ఏ లక్ష్యం లేకపోవటంతో, విసుగుచెంది అన్ని దేశాలు తిరిగొచ్చానని తానే సమాధానం చెప్పుకుంటాడు. మళ్ళా ఏదైనా చిత్రం తీయాలని ప్రయత్నిస్తాడు.

టాకీలు వచ్చాక కూడ మూకీ చిత్రమైన సిటీలైట్స్ విజయవంతం అవుతుంది కాని మరొక మూకీ చిత్రాన్ని తీయాలంటే భయపడ్డాడు. వెనుకబడిపోయిన సినీ దర్శకుడని అందరూ అనుకుంటారని అనుమానం పట్టుకుంది మూకీచిత్రాలే చాలా కళాత్మకమైనవని విశ్వసిస్తాడు. శబ్ద చిత్రాలలో పాత్రలను మరింతగా నటింపజేయవచ్చని గుర్తించాడు. కాని టాకీల ద్వారా తన పాత్ర ట్రాంప్, మూగ అభినయం దెబ్బతింటుందని, తన ట్రాంప్ మాట్లాడలేదని భయపడ్డాడు. అందుకనే ఏమీతోచక మళ్ళీ కొన్నాళ్లు విదేశాటన చేస్తాడు. ప్రాచ్య దేశాలకు బయలుదేరతాడు. జపాను సందర్శిస్తాడు.

## జపాను యాత్ర

జపానుకు చేరేముందు బాలి అడవుల్లో విహరించి అక్కడి ప్రజల సంగీతం, నృత్యం సాంస్కృతిక కార్యక్రమాలను తిలకిస్తాడు. జపాను (లో) ప్రభుత్వ అతిథిగా టోక్యోలో దిగి తన హోటలు గదికి కారులో పోతుండగా, చక్రవర్తి పాలెస్ ముందు కారు అకస్మాత్తుగా ఆగుతుంది. కారు నుండి బయటికి వచ్చి చక్రవర్తి భవనం వైపు తిరిగి గౌరవ సూచకంగా వంగి అభివాదం చేయమంటారు ! ఇది అక్కడి

సాంప్రదాయమట చార్లీ ఆశ్చర్యచకితుడై అభివాదం చేస్తాడు తరుహత కొందరు తమ జపాను చిత్రాలను కొనమని చెప్పి పంపుతారు. వాటిని కొననన్నాడని, రెండో రోజు రాత్రి తన గదిలో భోజనాలు చేస్తుండగా ఆరుగురు వ్యక్తులు గదిలో జొరబడి, తమ పూర్వీకుల చిత్రాలను కొననని అవమానపరచాడని చార్లీని బెదిరిస్తారు. భయాందోళనకర పరిస్థితులలో ఎలాగో తప్పించుకొని బయటపడ్డాడు.

ఆ మరుసటి రోజు ప్రధానమంత్రి కుమారుడు కుస్తీల పోటీలు చూడడానికి ఆహ్వానిస్తాడు. కుస్తీల పోటీలు చూస్తుండగానే ప్రధానమంత్రి హత్యగావింపబడ్డారని ప్రధానమంత్రి కుమారునికి తెల్పుతారు. చార్లీ గదిలో జొరబడ్డ ఆరుగురు నావికులు ప్రధానమంత్రి యింటికిపోయి, ఆయన భార్య, పిల్లల ముందే, అతి క్రూరంగా కాల్చి చంపుతారు.

ఆ తర్వాత తెల్సిన కథలో, న్యాయస్థానంలో యిచ్చిన సాక్ష్యాలను బట్టి ఆ రోజు చార్లీని కూడా ప్రధానమంత్రితోబాటు హత్య చేయవలసి ఉండెనని తెలుస్తుంది. ప్రసిద్ధ అమెరికా నటుడిని జపానులో హత్యచేస్తే, జపాను అమెరికాకు యుద్ధం వస్తుందని వారి ఆలోచన ! కాని చార్లీ హత్య విషయంలో హంతకులలో బేధాభిప్రాయాలు వచ్చి చంపటం మానుకున్నారని సాక్ష్యం.

జపాన్ ప్రజల సామాన్య జీవితం, నాగరికత, అందాలు, యాత్రా స్థలాలు, 'టీ సన్మానాలు' అన్నిటికీ చార్లీ ముగ్ధుడై, ఆ నాగరికత యింకా ఎన్నాళ్లో వుండదని, పశ్చిమ దేశాల నాగరికత, వ్యాపార వ్యవస్థల సంస్కృతికి నలిగిపోక తప్పదని బాధపడ్డాడు ఆనాడున్న క్రూరమైన ఆర్థిక మాంద్యం ప్రభావంలో ఒక పక్క తినుబండారాలు కుళ్ళిపోతూ, వస్తువులు గుట్టలుగా పడివుంటే, మరొక ప్రక్క తిండిలేక జనం అలమటిస్తున్నారనీ, లక్షల మంది నిరుద్యోగంతో బాధపడుతున్నారనీ విచారిస్తాడు. అమెరికాకు తిరిగివస్తాడు

సిటీ లైట్స్ తీసిన తర్వాత దాదాపు ఒక సంవత్సరంపాటు ఆలక్ష్యంతో అన్ని దేశాలు పర్యటిస్తాడు. తన జీవితానికి ఆసరా, లక్ష్యం ఏర్పడుతుందని ఆశిస్తాడు కాని ఏమీ లభించక కాలిఫోర్నియా తిరిగొచ్చి, ఏమి చేయాలో తెలియక, తికమక, విసుగుతో మిక్కిలి ఒంటరితనానికి గురి అవుతాడు. అప్పటికే కాలిఫోర్నియాలో వున్న తన అతి సన్నిహిత మిత్రులైన డగ్లస్, మేరీలు విడిపోతారు వారి కుటుంబం విచ్ఛిన్నమవుతుంది. దాంతో యిక ప్రపంచమే లేదనుకుంటాడు.

ఒక సాయంకాలం ఒంటరితనంతో అలసిపోయి, ఒక్కడే భోంచేయడానికి మనస్కరించక, మిత్రులూ లేక వీధుల వెంట తిరుగుతూ, అన్నీ అమ్ముకుని,

చైనా పోతే బాగుండుననుకుంటాడు. హాలీవుడ్‌లో జీవితం లేదనుకుంటాడు. నిశ్శబ్ద చిత్రాలు (మూకీలు) నడవక పోవచ్చని, తనంటే ప్రజలలో అభిమానం లేదనీ, ఎవరన్నా టెలిఫోన్ చేసి భోజనానికి రమ్మంటే బాగుంటుందని అభిలాష పడతాడు. కాని ఎవరూ పిలవరు !

అమెరికా పరిస్థితులు అపుడు తారుమారవుతున్నాయి. ఆర్థిక మాంద్యం, ప్రభుత్వ ఆర్థిక విధానాల వైఫల్యం - రూజ్ వెల్ట్ అమెరికా ప్రెసిడెంట్‌గా ఎన్నికైతే అమెరికన్ జీవిత విధానం నాశనమవుతుందన్న ఎన్నికల ప్రచారానికి వ్యతిరేకంగా రూజ్‌వెల్ట్ గెలుస్తాడు' అమెరికా ప్రతిష్టను నిలబెట్టడం " భయాన్ని జయించటమే" ముఖ్యమని "మరచిపోయిన మనిషి" ప్రసంగంలో రూజ్‌వెల్ట్ ఉద్ఘాటించటం జరిగింది. రూజ్‌వెల్ట్ తీసుకొన్న విధానాల ఫలితంగా అన్ని రంగాలలో పూర్తి మార్పులు జరగడంతో, హాలీవుడ్ జీవితంలో కూడా మార్పులు వచ్చాయి మూకీ చిత్రాల నటీనటవర్గం మాయమయింది. టాకీలు ఆధిపత్యం వహించడంతో హాలీవుడ్ కళాక్షేత్రంగా గాక ఒక పెద్ద సీరియస్ పరిశ్రమగా మారింది అంతా యంత్రాలమయం. అటువంటి పరిస్థితుల్లో కళ ఎలా జీవిస్తుంది ఎవడైనా కళాత్మక సృజన ఎలా చేస్తాడు? కనుక సినీరంగం వదిలి చైనాలో గాని, హాంకాంగ్‌లో గాని నివాసం ఏర్పరుచుకోవాలనుకుంటాడు చార్లీ

మూడు వారాలపాటు ఆలోచిస్తాడు. ఒక మిత్రుని దగ్గర నుండి నౌకాయానానికి పిలుపువస్తే అందమైన అమ్మాయిలుంటారని కాలక్షేపం అవుతుందని వెళ్తాడు. అక్కడే పాలెట్ గొడ్డార్డ్‌నేను కలుస్తాడు (చాప్లిన్ తారలందరినీ యిలాగే కలుస్తుంటాడు !) ఆమెని కొన్ని కష్టాల నుండి కాపాడటంవల్ల చార్లీకి చాలా దగ్గరవుతుంది. వేరే సినిమాల్లో పనిచేస్తూ, చార్లీతో తిరిగేది ఆమెతో చిత్రాలు తీయాలని ఆలోచిస్తాడు. తరువాత ఆమెను పెండ్లాడి మోడర్న్ టైమ్స్, ది గ్రేట్ డిక్టేటర్ చిత్రాలను ఆమెతో తీశాడు.

## " మోడర్న్ టైమ్స్ " (Modern Times)

సిటీలైట్స్ తర్వాత దాదాపు ఐదేండ్లపాటు చిత్రం తీయలేదు. చార్లీ ఒక రోజు న్యూయార్క్ వర్ల్డ్ పత్రిక రిపోర్టర్‌కు యింటర్వ్యూ యిచ్చాడు. ఆ రిపోర్టర్‌తో మాటల్లో తాను డెట్రాయిట్ నగరానికి పోతున్నానని చెప్తాడు చార్లీ డెట్రాయిట్ నగరంలో ఫ్యాక్టరీలలో బెల్టు విధానం ప్రవేశపెట్టారనీ దానివల్ల కార్మికులు తమ

ఆరోగ్యాన్ని అయిదారు సంవత్సరాల్లో పూర్తిగా కోల్పోయి, మానసికమైన ఆందోళనలకు గురి అవుతున్నారని ఆ రిపోర్టరు చెప్తాడు ఈ సంభాషణే మోడర్న్ టైమ్స్ చిత్రానికి మూలమని చార్లీ తెలుపుతాడు

మోడర్న్ టైమ్స్ 1935 లో పాలెట్ గొడ్డార్డ్‌తో తీస్తాడు. ఈ చిత్రం ఆధునిక యుగంలో పారిశ్రామిక ప్రభావంవల్ల మానవుడుపడే వేదనలపై ఒక వ్యాసం. చిత్రం హాస్య వినోదభరితమైనా, వాస్తవ ప్రపంచానికి సంబంధించింది. ఫ్యాక్టరీల్లో పనిచేసే కార్మికుల బాధలు, ప్రత్యేకంగా దెయ్యాలలాంటి కన్వేయర్‌బెల్టుతో పోటీలుపడే శ్రామికుల దరిద్రజీవితాల పై సానుభూతి చూపించేది, మానవజాతి జీవితంలో ఆనందం సౌఖ్యం కోసం వెతుకులాటలో పరిశ్రమలు, వ్యక్తిగత సంస్థలు నిర్వహించే పాత్రల కథ యిది ఫ్యాక్టరీ యంత్రాల, చక్రాల మధ్య బతుకు కంటే కుక్క గుడిసెలో జీవితం ఎన్నో రెట్లు బాగుంటుందని భావించి, చార్లీ ఫ్యాక్టరీవైపు వొక భయంకరమైన పిచ్చిచూపు చూచి ఫ్యాక్టరీ బయటకు పారిపోతాడు. మరలు, చక్రాల పళ్లలో మానవుడు యిరుక్కుపోయి, ఏమైపోతున్నాడో, ఎక్కడికి పోతున్నాడో తెలియకుండా యంత్రాల కోరలకు బానిసయైపోతున్నాడని వాపోతాడు. భయంకరమైన జీవిత సత్యాలకు హాస్యం పూత మాత్రమే. హాస్యం వెనుక ఘోరమైన విషాదం ఉంది. మధ్యాహ్న భోజనం కూడా యంత్రమే తినిపించే ఏర్పాటు ప్రదర్శనలో నవ్వు తెప్పించినా అతిశయం అనిపించినా, యంత్రయుగపు అమానుష లక్షణాలను హేళన చేయడమే ధ్యేయం, వీటన్నిటి ద్వారా వొక ముఖ్యమైన విషయాన్ని సూటిగా ప్రస్తావించాడు. పెట్టుబడిదారీ సమాజంలో విజ్ఞాన సాంకేతిక శాస్త్రాభివృద్ధి యావత్తూ పరిశ్రమాధిపతులకే చెందుతుందనీ, కష్టపడే కార్మికునికి ఆకలి, దారిద్ర్యం, మానసిక ఆందోళన మాత్రమే మిగులుతాయనీ, పెరుగుతున్న పారిశ్రామికీకరణ సామాన్య మానవుడిని వొక యంత్రం స్థాయికి దిగజార్చిందని, సృజనాత్మకశక్తిని ఈ పెట్టుబడిదారీ సమాజం నాశనం చేస్తుందని, ఉత్పత్తులు పెరుగుతున్నా బజారులో వస్తువుల కొరతవల్ల కొనుగోలు శక్తి తగ్గిపోవటంతో కార్మికుడు తన కనీసావసరాలకు కూడా నోచుకోలేక పోతున్నాడనీ అత్యంత ప్రతిభావంతంగా ప్రదర్శించాడు.

చార్లీ మూకీ చిత్రాలలో మోడర్న్ టైమ్స్ ఆఖరిది. క్లుప్తంగా ఆ చిత్రం కథయిది: చిత్రంలో చాప్లిన్ (ట్రాంప్) ఫ్యాక్టరిలో కార్మికుడు బెల్టుమీద రోజంతా రెండు నట్లను బిగిస్తూ మానసికంగా అనారోగ్యానికి గురై హాస్పిటల్ పాలవుతాడు. ఫ్యాక్టరిలో పనిచేస్తున్నపుడు చాప్లిన్‌కి ప్రపంచమంతా మరలు, కోరలు, నట్లు,

బోల్టులుగానే కనిపిస్తుంది. (అందమైన స్త్రీల వస్త్రాలపై, వక్షోజాలపై ఉన్న పూలపూల రంగురంగుల గుండీలు, అద్దకాలు కూడా) హాస్పటల్ నుండి విడుదలై వొక లారీవాడు దయతల్చగా ఒక వీధిలో దిగుతాడు. లారీ నుండి జారిపడిన ప్రమాద సూచకమైన ఎర్రజెండా పట్టుకొని ఉంటాడు. ఇంతలోనే కార్మికుల సమ్మె ప్రదర్శనకారుల గుంపు చాప్లిన్‌తో కలిసిపోతుంది. ఎర్రజెండా పట్టుకొని ఉన్నందున చాప్లిన్ కమ్యూనిస్టనీ, కార్మిక నాయకుడనీ పోలీసులు అరెస్టు చేస్తారు. జైలుపాలవుతాడు జైలు నుండి విడుదలయి వస్తూండగా ఒక బజారుపిల్ల (ఫాలెట్) రొట్టె ముక్క దొంగిలించిందని పోలీసులకు అప్పగించబడుతుండగా, ఆ రొట్టెను తనే దొంగిలించానని చాప్లిన్ ముందుకు వచ్చి, పోలీసులతో తన్ను అరెస్టు చేయమంటాడు. జైలుకు పంపమంటాడు. ఎందుకంటే బయట సమాజంలో కంటే జైలులోనే బాగున్నది. పోలీసు వ్యానులో తనని, ఆ అమ్మాయిని తీసుకొనిపోతుండగా వ్యాను నుండి దూకి యిద్దరూ తప్పించుకుపోతారు అప్పటి నుండి యిద్దరూ కలిసి ఉంటానికి ప్రయత్నం చేస్తారు. కాని ఎక్కడ చూసినా నిరుద్యోగం, దారిద్ర్యం, ఆర్థికమాంద్యం, సమ్మెలు, మూతపడిన ఫ్యాక్టరీలు, హింసాకాండ! ఎన్నో చిన్న చిన్న పనులుచేసి జీవించటానికి ప్రయత్నిస్తారు. జీవితాన్ని చక్కదిద్దుకోవాలని ఓ యిల్లు సమకూర్చుకోవాలని ఎంత ప్రయత్నించినా వీధులే మిగులుతాయి. ఆనాటి పరిస్థితులు వారిని స్థిరపడనీయకుండా చాలా కష్టపెడతాయి. చివరికి ఫాలెట్ విసుగుచెంది జీవితాన్నుండి పారిపోవాలని ప్రయత్నిస్తే జీవించి సాధించాలని, సాధించి జీవించాలని నేర్పి జీవితం సాగించటానికి వొప్పిస్తాడు చాప్లిన్.

పారిశ్రామికీకరణ తెచ్చిపెట్టిన సామాజిక, ఆర్థిక పరిస్థితులను గురించి ఎంతో సున్నితంగా, చమత్కారంగా మనల్ని నవ్విస్తూనే, విషయాలను చాలా విశదంగా, నిశ్శబ్దంగా బోధిస్తాడు. కార్మికుల జీవితంమీద పారిశ్రామికీకరణ ప్రభావాన్ని ప్రధానంగా మనకు చూపించినా, ఆ చిత్రం అసలు కథ అదికాదు. తన ట్రాంప్ పాత్రధారికి స్థిరమైన ఒక నివాసం, ఇల్లు సమకూర్చటంలో జరిగిన ప్రయత్నమే మోడర్న్ టైమ్స్. మొదటి నుండి చాప్లిన్ (ట్రాంప్) కి ఓ "యిల్లు" లేదు. సిటీలైట్స్‌లో తానొక సారి లక్షాధికారి యింట్లో, మరోసారి అంధ పూలబాల యింట్లో ఉంటాడు. మోడర్న్ టైమ్స్‌లో కొన్ని రోజులు హాస్పటల్‌లో, జైలులో, డిపార్టుమెంట్ స్టోర్స్‌లో, విలాసాల హోటళ్లలో, వీధుల్లో, చివరికి ఫాలెట్ చూపించిన కుక్క యింట్లో ఉంటాడు. చివరికి మళ్లీ వీధులు, అసలు తనదంటూ ఒక "స్వంత యిల్లు" లేదు. తనొక దేశ దిమ్మరి.

ఏదైనా యింట్లో తానున్నప్పుడు యింకెవరూ ఆ యింట్లో ఉండరు అందుకనే తనపాత్ర వీధులవెంట నడుస్తూ, తిరుగుతూ ఉంటుంది తనొక బహుదూరపు బాటసారి నిర్దిష్టమైన గమ్యంలేదు సమాజంలో అందరి మాదిరిగానే ఒక యింటివాడుగా ఉండలేడు, సరిపుచ్చుకోలేడు ఇదంతా చాప్లిన్ వాస్తవ జీవిత ప్రతిబింబమే, మానసికంగా ఒక సామాజిక చట్రంలో యిమడని వానికి తనదంటూ ఒక నివాస స్థల ముండదు అందుకే "Keep movıng nobody keep movıng" అనే మాటలతో మోడర్న్ టైమ్స్ చిత్రం ముగుస్తుంది

అయితే యింతకుముందువలె కాక ఒక స్నేహితురాలితో దిగంతాలకు బయలు దేరతాడు కాని ఆ స్నేహితురాలు చపల, చంచల, భాల, భార్యకాదు. తన పక్కనే తనెకెదురుగా నడుస్తుంది మంచి మిత్రురాలు కావాలనుకుంటాడు కాని దొరకదు చాప్లిన్ నిజంగా కోరుకున్నది కూడా అదే ! ఆమె ఆశలకూ, తన అశయాలకూ, తెలివితేటలకు సరిపడదు. చాలా విచిత్రమైన కలయిక ! ఎవరికి వారేగా వుంటారు! చార్లీ స్వప్నం, చాప్లిన్ వాస్తవికత రెండూ ఒకటే ! ఒక గమ్యానికి చేరవలసివుంది జీవితంలో తాను కోరింది ప్రతిదీ దొరికింది ఒక స్థిరమైన పాత్ర, ఒక్క విశ్రాంతి స్థలం తప్ప ! వీధుల పర్యటన, దేశాటన మాత్రమే శరణ్యమైంది

ట్రాంప్ ప్రప్రధమంగా ఈ సినిమాలో తన గళాన్ని ఒక హంసగీతి ద్వారా విన్పిస్తాడు. అదే చివరిసారి కూడా ఆ గీతిక అనేక భాషల సమ్మిశ్రితం, విచిత్ర శబ్దాలు వినిపించే విచిత్ర పదజాలం వాటికి సరిపోయిన సంగీతంతో ప్రేక్షకులను గల గల నవ్వించే సెలయేటి పాట దాని అర్థం ఎవరికీ తెలియదు. చాప్లిన్ ఎక్కడా చెప్పలేదు. అదొక మిస్టరీ. మూకీ జగత్తు వెండితెరపై అనంత పాంథుడు ప్రపంచ ప్రేక్షకులందరినీ తమ వూహాలోకాలలో ముంచుతూంది. సంపూర్ణ అవగాహన ఎవరికీ అందనిది. అలా మోడర్న్ టైమ్స్‌లో పాడిన పాట ఆధునిక కాలానికి అంతర్జాతీయతకు ప్రతీక కావచ్చు ట్రాంప్‌గా తాను వొక భాషకు చెందినవాడను కానని తెలుపుతుంది. తాను మాట్లాడితే అన్ని జాతులకు చెందిన అంతర్జాతీయ భాష ద్వారనే మాట్లాడుతానంటాడు. అందుకే మళ్ళీ తన స్వరాన్ని ఎవరికీ విన్పించలేదు.

అలా పాడిన హంసగీతి యిది

ఈ ప్యూసే డొమ్మెట్రో - సీ బెల్లా ప్యూ పాటోరే
జీ నోత్రో సో కాటోరే - జీ నోత్రో క్యూ కావోరే
లీ స్పికాష్ ఆర్ వే బుషో - సిగరెట్టో టో టో బెల్లో

ఇ రక్షో స్పాగలెట్టో - సి లా టూ లా టూలా ట్వాల్
సి నారా పే లే పిమ్హా - వా లెస్ వాస్ లా టాక్సి మీటర్
లె జొంటో సర్ లే జింటా - జీ లే టూ లే టూ లెట్వా
లా డెర్ లా సెర్ పాన్ బ్రోకర్ లా సర్ అప్రెర్ హోమచర్
ఇస్సే కన్‌పెస్ ఎ పోట్వా - పొంకా వాలా పొంకా వాహ్వా !

మోడర్న్ టైమ్స్ చిత్రాన్ని "ప్రతిధ్వనించే నిశ్శబ్దంగా" (Resounding Silence) గా వర్ణించారు ఈ చిత్రం విడుదలకాక ముందు నుండే అది కమ్యూనిస్టు సినిమా అని పత్రికల వాళ్ళు ప్రచారం చేశారు పెట్టుబడిదారీ వర్గం చాప్లిన్‌ను విమర్శించారు ఏమైనా పారిశ్రామిక యుగంలో రాను రాను దిగజారిపోతున్న సామాన్యుల దుస్థితిని గొప్పగా చూపించిన కళాఖండం "మోడర్న్ టైమ్స్" ఈ చిత్రం అన్ని చోట్లా బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది

చిత్రం పూర్తయిన తర్వాత అయదు నెలలపాటు హోనో లూలూ హాంకాంగ్‌లలో హీరోయిన్ (ఫాలెట్ గొడ్డార్డ్)తో వినోద పర్యటనలు చేస్తాడు. ఆ పర్యటనలో ఎవరికీ తెలియకుండా ఫాలెట్ గొడ్డార్డుతో వివాహం అవుతుంది 1932 నుండే వాళ్ళిద్దరూ కలిసి వుంటూ వుంటారు. వివాహం అయిన తర్వాత కూడ ఈ విషయం రహస్యంగానే వుంచుతారు. ఫాలెట్ చార్లీకి మూడో భార్య, తారగా గొప్ప నటి. చార్లీని అర్థం చేసుకుంటుంది. చార్లీ యిద్దరు పిలల్లను కూడా చాలా ప్రేమగా చూచుకొనేది.

పర్యటన నుండి తిరిగి వచ్చిన తర్వాత మళ్ళీ ఏంచేయాలని ప్రశ్నలు మూకీ చిత్రం యింకోటి తీయొచ్చా ? అప్పటికి హాలీవుడ్‌లో అందరూ టాకీ చిత్రాలే తీస్తున్నారు. ఫాలెట్ పారమౌంట్ చిత్రాలలో విరామం లేకుండా పని చేయటం, తనకేమీ తోచకపోవడం, ఆమెకు దూరం కావటం మొదలైంది. మళ్ళీ వినోద పర్యటనలకై కొన్నాళ్ళు పెబుల్ బీచికి ప్రయాణం కట్టాడు అక్కడ కొందరు రచయితలతో పరిచయాలవుతాయి.

## 'ది గ్రేట్ డిక్టేటర్' (The Great Dictator)

ఈ రోజులలోనే రెండవ ప్రపంచ యుద్ధ వార్తలు రావటం ప్రారంభమవుతుంది. నాజీలు క్రూరంగా వ్యవహరిస్తుంటారు. ప్రథమ ప్రపంచ యుద్ధపు గాయాలు

యింకా పూర్తిగా మానకముందే, మానవ కంకాళాన్ని ఎలా మర్చిపోయి మళ్ళీ యుద్ధ బీభత్సాన్ని ఎందుకు రెచ్చగొట్టున్నారని తనలో తానే అనుకుంటాడు చాప్లిన్.

ఫాలెట్‌తో వొక ప్రేమ చిత్రం తీయటానికి కథ రాయాలని ప్రయత్నిస్తుంటాడు. హిట్లర్ పిచ్చి ప్రపంచాన్నంతా కలచివేస్తుంటే ప్రేమ చిత్రం తాలూకు కథ ఎలా బయటికొస్తుందంటాడు చార్లీ.

1937 లో అలెగ్జాండర్ కోర్డా, హిట్లర్ మీసం, తన ట్రాంప్ పాత్ర మీసం ఒకే మాదిరిగా వుండటం ఆధారంగా హిట్లర్ పై వొక చిత్రాన్ని తీయమని సలహా ఇచ్చాడు అంతకు ముందే జర్మనీ నుండి వాండర్ బిల్ల్ పంపిన హిట్లర్ ప్రసంగాలు చేస్తున్న ఫోటోలను చూచి, తన పాత్రనే హిట్లర్ అనుకరిస్తూ వికృతంగా నటిస్తున్నా డనుకుంటాడు చాలా అసహ్యం వేసింది. హిట్లర్ చాలా పిచ్చివాడుగా, మొండివాడుగా కనపడతాడు చార్లీకి ఐన్‌స్టీన్‌ను, థామస్ మాన్‌ని జర్మనీ నుండి గెంటి వేసిన తర్వాత హిట్లర్ చాలా పాపాత్ముడనుకుంటాడు

హిట్లర్ మీదున్న ఈ అభిప్రాయాలతో అతని మీద చిత్రం తీయాలని పని ప్రారంభిస్తాడు. తన ట్రాంప్ పాత్ర విశిష్టత కోల్పోకుండా హిట్లర్‌లా తన పాత్ర ద్వారా జనాన్ని ప్రసంగాలతో పిచ్చివాళ్లను చెయ్యవచ్చు ననుకుంటాడు కథ వ్రాయటం రెండేళ్ళు తీసుకుంది ఫాలెట్ గొడ్డార్డుతో సంసార సంబంధాలు అంతంత మాత్రమేయైనా మంచి స్నేహితులుగా మసలుకుంటారు. ఆమెకు ఈ చిత్రంలో పాత్ర యిచ్చాడు. రెండేళ్ళ కాలం పారమౌంట్‌లో పనిచేసి ఆమె బాగా డబ్బు చేసుకుంటుంది కథ వ్రాయటంలో తలమునకలవుతున్నపుడు స్టూడియోలో కలిసి, అర్జంటుగా మాట్లాడాలని, మోడర్న్ టైమ్స్ చిత్రం తాలూకు తనకు రావలసిన డబ్బు తనకు రాలేదని ఆమె చార్లీతో వాదనకు దిగింది.

"ది గ్రేట్ డిక్టేటర్" చిత్ర నిర్మాణం సగంలో వుండగా యునైటెడ్ ఆర్టిస్టు కార్యాలయాన్నుండి ప్రమాదకర వార్తలొచ్చినై. ఆ సినిమా సెన్సారు షిప్పు సమస్యలకు గురౌతుందని, నిర్మాణం మానుకోమని సలహాయిచ్చారు. ఇంగ్లాండు నుండి కూడా హిట్లర్‌కు వ్యతిరేకమయిన సినిమా నడవటం కష్టమవుతుందని వార్తలు వచ్చినా, ఏమైనాకాని, చిత్రం పూర్తిచేయాలని, కావాలంటే తన స్వంత డబ్బుతో సినిమా హాళ్లను అద్దెకు తీసుకొని నడిపిస్తానని ధైర్యంతో ముందుకు సాగుతాడు. సినిమా మొదలుపెట్టటానికే ఐదు లక్షల డాలర్లు ఖర్చయింది. మొత్తం 2,15,000 అడుగుల నిడివి చిత్రం తీశాడు. కాని చివరికి 9,000 నిడివి

చిత్రాన్ని మట్టుకే చూపించాడు ఈ చిత్ర నిర్మాణంలో రాత్రింబవళ్ళు తాను పనిచేస్తూ, అందరినీ పనిచేయమంటాడు అత్యంత సమగ్రమైన (Perfection) ప్రదర్శన అంటే చార్లీకి యిష్టం దానికోసమై అందర్నీ యిబ్బంది పెట్టేవాడు. ఫొలెట్ సెట్స్ మీద ఏడ్చేసేది ! చేసిన నటననే మళ్ళీ, రిహార్సల్స్‌తో కెమెరా ముందు నటన ! ప్రతి సినిమాలో చార్లీ ఇదే పద్ధతి అయితే చార్లీ దర్శక ప్రతిభతో కళాతృష్టతో నటీనటులలో గల నటనా కౌశల్యాన్ని, చాతుర్యాన్ని బయటకు తీసుకురావటానికి వాళ్ళను యిబ్బందిపెట్టినా వాళ్ళెప్పుడూ అతని నిజాయితీని, కళాత్మకమైన విలువలపట్ల శ్రద్ధనూ శంకించలేదు. మేనేజర్లు, ఛాయాచిత్ర గ్రాహకులు, సహాయ దర్శకులు, నటీనటులు ఆయన దగ్గర దాదాపు జీవితకాలం పనిచేసి జీవితాన్ని చాలించిన వాళ్లు లేక రిటైరైనవాళ్ళేగాని, ఆయనమీద విసుగుచెంది చార్లీని వదిలిపెట్టిన వాళ్ళెవరు లేరు (తన మొదటి ముగ్గురు భార్యలు తప్ప) అలా అందరినీ చాలా కష్టపెట్టి తాను కష్టపడి తీసిన చిత్రం "ది గ్రేట్ డిక్టేటర్" ఒక కళాఖండం. ప్రపంచంలో డిక్టేటర్ల నందరినీ హేళనచేస్తూ ప్రజాస్వామ్యం, శాంతి, అభివృద్ధికి సంకేతంగా నిలిచింది.

హిట్లర్ ప్రతిపాదించిన శుద్ధ రక్తజాతి (Pure Blood Race) సిద్ధాంతాన్ని, హిట్లర్ ఉన్మాదాన్ని అవహేళనచేసి అవహాస్యం పాలుచేయాలని చార్లీ అనుకుంటాడు అయితే హిట్లర్ చేసిన ఘోరకృత్యాలు, నాజీ కాన్సెంట్రేషన్ క్యాంపులో జరిగిన అమానుషమైన ఘోర వాస్తవాలు పూర్తిగా చార్లీకి తెలియకముందే చిత్రం పూర్తవుతుంది అవన్నీ తెలిసుంటే చిత్రం మరోవిధంగా వుండేదని భావిస్తాడు చార్లీ

చిత్రం పూర్తికాక ముందే ఇంగ్లాండు నాజీలమీద యుద్ధాన్ని ప్రకటిస్తుంది. జర్మనీ అన్ని దేశాలను జయిస్తూ ముందుకు పోతుంటుంది. ఇంగ్లాండు ఒంటరిగా పోరాడుతుంది. ఇంతలోనే న్యూయార్క్ కార్యాలయం నుండి "సినిమా తొందరగా తీయమని అందరూ వేచిచూస్తున్నారని" వార్త. రష్యామీద దాడి చేయటానికి హిట్లర్ నిశ్చయించుకుంటాడు అమెరికా యుద్ధంలో పాల్గొనటంలేదు

చిత్ర నిర్మాణం చివరిదశలో వుండగా అతి సన్నిహితుడైన మిత్రుడు డగ్లస్ ఫేర్ బ్యాంక్స్ మరణిస్తాడు. హాలీవుడ్‌లో వేలమంది వున్నా డగ్లస్ ఒక్కడితోనే గాఢమైన స్నేహం వల్ల అతని మరణం చార్లీకి చాలా బాధ కలిగిస్తుంది.

"ది గ్రేట్ డిక్టేటర్" సినిమా తీస్తున్నప్పుడు చార్లీకి ఎన్నో ఆకాశరామన్న

బెదరింపు వుత్తరాలు వచ్చినవి సినిమాహాళ్లలో బాంబులు వేస్తామని, తెరలు చింపేస్తామని, హింసాకాండ పెచ్చరిల్లుతుందని నాజీ మద్దతుదార్లు బెదిరించారు నాజీ వ్యతిరేక సంఘం వాళ్ళ సహాయాన్ని అర్థిస్తే వాళ్ళ నాయకుడు హారీ బ్రిడ్జెస్ దేనికీ భయపడనక్కరలేదనీ, నాజీ బూచి పట్టపగలు బయట పడటానికి సాహసంలేని పిరికిదని, ఏదైనా జరిగితే అభిమాన ప్రేక్షకులే వాళ్ల పనిపడ్తారనీ ధైర్యం చెబుతాడు. కారణం న్యాయమైనదైతే ప్రజలకు పోరాడమని చెప్పే అవసరం లేదని, వాళ్ళ ముందు వాస్తవాలనుంచితే ప్రజలే నిర్ణయించుకొని చేయవలసింది చేస్తారని ఉపదేశిస్తాడు.

20 లక్షల డాలర్లు ఖర్చు పెట్టి రెండేళ్ళు కష్టపడి తీసిన "ది గ్రేట్ డిక్టేటర్" న్యూయార్క్‌లో రెండు ధియేటర్లలో విడుదలై 15 వారాలపాటు అపూర్వంగా ప్రదర్శింపబడుతుంది. చార్లీ తీసిన అన్ని చిత్రాల కంటే ఎక్కువ డబ్బు చేసుకుంది. అయితే పత్రికల వాళ్ళు చిత్రాన్ని గురించి సరిగా వ్రాయకపోగా, కమ్యూనిజాన్ని బోధించడానికి ప్రయత్నం జరిగిందని వ్రాశారు. దానికి కారణం సినిమాలో చార్లీ చేసిన ప్రసంగం. ఆ ప్రసంగానికి చాలామంది అభ్యంతరం పెట్టారు. ఆ ప్రసంగం హిట్లర్ రూపంలో వున్న మంగలి చేసింది కాదు, చాప్లిన్ చేసిందేనని విమర్శిస్తారు. అయితే ప్రేక్షక అభిమానుల దగ్గరి నుండి ఎన్నో వుత్తరాలు ప్రసంగాన్ని మెచ్చుకుంటూ వచ్చాయి.

చిత్రంలో చార్లీ రెండు విభిన్న పాత్రల్లో నటించాడు ఒక పాత్ర హిట్లర్, రెండవది ఒక యూదు మంగలి పాత్ర. హిట్లర్ ప్రసంగించే తీరు, నడక, నియమాలు అన్నింటినీ అనుకరించి ఆ నియంతను అవహేళన చేస్తాడు. ప్రపంచంలోని ప్రతి నియంతను ఉద్దేశించి వారి ఉన్మాద కృత్యాలను అవహేళన చేస్తాడు. తమది శుద్ధ ఆర్యజాతి. ప్రపంచాన్ని పాలించే అధికారం, హక్కు వారికే వుంది. కనుక ప్రపంచాన్ని జయించాలని కలలుకంటూ హిట్లర్ గ్లోబ్‌తో ఆడుకోవటం, ఉన్నట్టుండి తాను కన్న పగటికలలు పటాపంచలైపోయినట్టు, రబ్బర్ గ్లోబ్ పేలిపోవటం, నియంతల ఓటమి తప్పదని, భంగపాటు జరుగుతుందని వ్యంగ్య స్ఫూర్తిగల సన్నివేశాలు చిత్రీకరించాడు.

హిట్లర్ యూదుమంగలి దాదాపు ఒకే రూపంలో ఉంటారు. కాబట్టి ఒక చిన్న పొరపాటు జరుగుతుంది. యూదు మంగలిని హిట్లర్ అని భ్రమపడి పెద్ద సైనిక కవాతులో ప్రసంగించమని కోరతారు. ఆ ప్రసంగంలో తాను హిట్లర్‌లాకాక

ప్రపంచ మానవాళికి శాంతి సందేశాలిస్తూ సైనికులను తిరగబడమని ఉద్బోధిస్తూ చార్లీ చేసిన ప్రసంగం నియంతలకు, సామ్రాజ్యవాదులకు, యుద్ధోన్మాదులకు మింగుడుపడదు ఆ ప్రసంగమిది

క్షమించండి నేనొక చక్రవర్తిని కావాలని కోరుకోవటం లేదు నేనెవరినీ జయించాలని కానీ, పాలించాలని కానీ కోరుకోవటం లేదు అది నా వృత్తికాదు మహాశయులైన యూదుకూ, నల్ల వాళ్లకూ, తెల్ల వాళ్ళకూ అందరికీ సహాయం చేయాలనుకునే వాణ్ణి

మనమందరం ఒకళ్ళ కొకళ్లు సాయం చేసుకోవాలని కోరుకుంటాం అది మానవ లక్షణం "మనమందరం ప్రతివాడి ఆనందం కొరకు జీవిస్తాం, కాని ప్రతివాడి దుఃఖం కొరకుకాదు. మనం ఒకళ్ళనొకళ్లు అసహ్యించుకోవాలని, మోసగించుకోవాలని కోరుకోం. ఈ ప్రపంచంలో ప్రతివాళ్ళకు స్థానం వుంది ఈ భూమి అందరికీ కావలసిన సకల సౌభాగ్యాలను సమకూర్చగలదు.

"మన జీవితం స్వేచ్ఛా" సౌఖ్యాలతో సంతోషంగా వుండగలదు కానీ మనం దారితప్పాం పేరాశ మానవాత్మలను విషకలుషితం చేసింది. ప్రపంచంలో ఏహ్యత అనే అడ్డుగోడలను నిలబెట్టింది దుర్మార్గత్వం మనలో ప్రవేశించి రక్తపాతానికీ, విషాదానికీ దారితీసింది మనం వేగాన్ని పెంచాం. మనల్ని మనలోనే బంధించుకొన్నాం మరలు మనకన్నీ సమృద్ధిగా సమకూర్చినా మనంమాత్రం దారిద్ర్యంలోనే మగ్గుతున్నాం మనం సంపాదించిన విజ్ఞానం మనల్ని విరక్తులను చేసింది మన తెలివితేటలు మనల్ని నిర్దయ పాషాణాలుగా తయారు చేశాయ్. మనం ఎంతో ఆలోచించాం, కాని అతి కొద్దిగా అనుభవిస్తున్నాం. యంత్రాగారం కంటే మనకు మానవత్వం అవసరం. తెలివితేటలకంటే మనకు దయ, సరళత్వం అవసరం. ఈ లక్షణాలు లేకుంటే జీవితం హింసాత్మకమై అంతా కోల్పోతాం.

విమానం, రేడియో మనల్ని దగ్గరికి చేర్చాయి. ఇవన్నీ మనిషిలోని మంచితనాన్ని చూపుతున్నాయి విశ్వ మానవ సౌభ్రాతృత్వాన్ని, ఐక్యతాతపనని తెల్పుతున్నాయి. నా మాట ప్రపంచంలో వున్న అందరికీ చేరుతుంది. లక్షలాది నిస్సహాయులైన స్త్రీలు, పురుషులు, పిల్లలు నేటి ఈ జీవిత విధానానికి బలై, హింసాత్మక బాధలకు గురై, జైళ్ళ పాలయిన అమాయక జీవులున్నారు. వారందరినీ నిస్సహాయులుగా భావించవద్దని కొరుతున్నా. ఈనాడున్న విషాదచ్ఛాయలు, దురాశ నీడలు-మానవజాతి అభివృద్ధి చెందుతుందని భయపడి కొందరు చేస్తున్న దౌష్ట్యం

తొలగిపోతుంది. నియంతలు చస్తారు ప్రజల నుండి గుంజుకున్న ప్రజాధికారం మళ్ళీ ప్రజలకే వస్తుంది మనుష్యుల ఆత్మార్పణలు, వీర మరణాలు, త్యాగాలు వృధా కావు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఎప్పటికీ నాశనం కావు

"సైనికులారా ! ఈ దుర్మార్గులకు సహాయం చేయకండి" వాళ్ళు మిమ్మల్ని ఏహ్యంగ చిన్నచూపు చూస్తారు మిమ్మల్ని బానిసలుగా మార్చారు. మీ జీవితాలతో అటలాడుకుంటున్నారు మీరేం చేయాలో, ఏమాలోచించాలో, ఎలా వుండాలో, క్రమశిక్షణతో నేర్పుతారు మీకింత పడేస్తారు మిమ్మల్ని పశువులుగా చూస్తారు ఫిరంగి మందుగా వాడుకుంటారు ఈ అసహజ పాలకులకు తోడ్పడకండి వాళ్ళు మరమనుషులు, వాళ్ళవి మర హృదయాలు, వారికి మానవత్వం లేదు యాంత్రిక హృదయాలకు మీరేమాత్రం సాయపడకండి. మీరు యంత్రాలు కారు! మీరు మనుషులు ! మానవత్వం, ప్రేమ హృదయాలనిండా వున్నవాళ్ళు ! మీరు అసహ్యించుకోరు! ప్రేమని పొందనివాడే ప్రేమించే వాళ్ళను అసహ్యించు కొంటాడు

"యోధులారా ! బానిసత్వం కొరకు పోరాడకండి ! స్వాతంత్ర్యం కొరకు పోరాడండి! సెయింట్ ల్యూక్ పదిహేడవ అధ్యాయంలో భగవంతుని సామ్రాజ్యం మనలోనే వున్నదని వ్రాసి వుంది ఒక వ్యక్తిలో కాదు ఒక గుణంలో కాదు - ప్రతి ఒక్కనిలో వుంది ! ఆ సామ్రాజ్యం మీలో వుంది ! మీకందరికి అధికారం వుంది యంత్రాలను తయారు చేసే శక్తి వుంది. ఆనందాన్ని సృష్టించే శక్తి వుంది. జీవితాన్ని స్వేచ్ఛగా, సౌందర్యవంతంగా, అద్భుతంగా మలచుకోగల ధైర్యం, సాహసం, శక్తి మీలో వుంది - అందుకని ప్రజాస్వామ్యం పేరుతో ఆ అధికారాన్ని వాడుకుందాం - సమైక్యం కండి. ప్రతి వాడికి పని, భవిష్యత్తు, వృద్ధాప్యంలో రక్షణ కలిగించే మరో నూతన ప్రపంచాన్ని సృష్టించుకునేందుకు పోరాడుదాం

"ఇవన్నీ కలిగిస్తామని ప్రమాణాలు చేసి ఈ దుర్మార్గులు అధికారంలోకి వచ్చారు వాళ్లు అబద్ధాలాడారు వాళ్ళు వాగ్దానాలను ఎప్పటికీ నెరవేర్చరు నియంతలు తాము స్వేచ్ఛగా వుంటూ ప్రజల్ని బానిసలుగా మారుస్తారు. ఇపుడు మనందరం స్వేచ్ఛా ప్రపంచం కొరకు పోరాడుదాం. జాతుల అడ్డంకులు తొలగిద్దాం దురాశనూ, ఏహ్యతనూ, ఓర్పులేనితనాన్ని నిర్మూలిద్దాం హేతుబద్ధమైన లోకం కొరకు పోరాడుదాం ఆ లోకంలో విజ్ఞాన శాస్త్రం, ప్రగతి మానవుల ఆనందానికి దారి చూపుతాయి. సైనికులారా ! ప్రజాస్వామ్యం పేరుతో ఐక్యత సాధిద్దాం

"హన్నా పైకి చూడు ! పైకి చూడు హన్నా ! కారు మబ్బులు తొలగిపోతున్నాయి.

సూర్యోదయం అవుతుంది ! చీకటి ముసుళ్ళ నుండి మనం వెలుగులోకి వస్తున్నాం మనం కొత్త ప్రపంచంలోకి ప్రవేశిస్తున్నాం ! అది దయగల లోకం అక్కడ అందరూ పేరాశనూ, హింసను, ఏహ్యతను జయించిన వాళ్ళే ! పైకి చూడు హన్నా ! మానవాత్మకు రెక్కలొచ్చినయి. ఎంత కాలానికో మానవుడు ఎగర గలుగుతున్నాడు. ఇంద్రధనస్సులోకి, ఆశల వెలుగులోకి చొచ్చుకుపోతున్నాడు. పైకి చూడు హన్నా, పైకి చూడు !"

చిత్రం ఆఖరులో చేసిన ఈ ప్రసంగం చాలా ప్రసిద్ధి చెందింది. అది మానవ హృదయ కుహరాలనుండి వెలువడ్డది. 'బాధా సర్పదష్టులకు, దగా పడిన తమ్ముళ్ళకు' ప్రపంచానికీ, మానవాళికీ చార్లీ చాప్లిన్ ఇచ్చిన ఆశా సందేశం

"ది గ్రేట్ డిక్టేటర్" చిత్రం నియంతృత్వాన్ని, ఫాసిస్టు రాజ్యాలను, అక్కడ జరుగుతున్న అమానుష కృత్యాలను, కోట్లాది ప్రజలపై జరుగుతున్న పీడనం, హింస, బాధలను వ్యక్తీకరించడానికి తీసిన విషాద చిత్రం - 1935 లో అనుకున్నది 1940 లో విడుదలవుతుంది

"ది గ్రేట్ డిక్టేటర్" విడుదలైన వారానికి న్యూయార్క్ టైమ్స్ పత్రికాధిపతి అర్థర్ సెల్జెబెర్జర్ చాప్లిన్‌ను విందుకు ఆహ్వానించాడు. విందుకు ముందు చార్లీని మాజీ అమెరికన్ ప్రెసిడెంట్ హెర్బర్ట్ హూవర్‌తో పరిచయం చేస్తారు. విందు జరుగుతుండగా హూవర్ యూరప్‌ను రక్షించటానికి కొన్ని ప్రతిపాదనలు చేశాడు యుద్ధ సమయంలో అక్కడి ప్రజల బాధలనుండి ఉపశమనం కలిగించటం మానవ ధర్మమని ఏ రాజకీయ పక్షానికి చెందనివారు స్వేచ్ఛందంగా ఈ పని చేయాలని ఆయన ప్రతిపాదనలసారం ఏ సహాయం చేసినా అది నాజీలకు కాదని, యూదులకు మాత్రమే చేయాలంటాడు చార్లీ

ఇతర సమావేశాలలో కూడా చార్లీ నాజీ వ్యతిరేక ప్రదర్శనను చూసి ఆయనను యూదు క్రింద పరిగణించారు. మనిషి మంచితనమే కాని జాతితో సంబంధం లేదంటాడు చార్లీ.

ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ కోరికమీద ది గ్రేట్ డిక్టేటర్ చిత్రాన్ని వైట్‌హౌస్‌లో ప్రదర్శించారు చార్లీ రూజ్ వెల్ట్‌ని కలిశాడు. మాటల్లో అర్జెంటీనాలో ఈ సినిమా చాలా సమస్యలు తెచ్చి పెట్టిందంటాడు రూజ్ వెల్ట్ చార్లీతో. ది గ్రేట్ డిక్టేటర్ అమెరికా ప్రేక్షకులందరి అభిమానాలు చూరగొన్నా, లోలోపల దాని వ్యతిరేకత కూడా పెరిగింది పత్రికా ప్రతినిధుల సమావేశంలో పాత్రికేయులు చాలా

అమర్యాదగా ప్రవర్తించారు. పత్రికల్లో చార్లీని విమర్శిస్తూ కథలు, వ్యక్తిగత జీవితాన్ని గురించి వదంతులు ప్రచారం చేశారు. అయినా కూడా అమెరికాలో ఇంగ్లాండులో ది గ్రేట్ డిక్టేటర్ చిత్రం బ్రహ్మాండంగా ప్రదర్శింపబడింది

అమెరికా అప్పటి వరకు యుద్ధంతో ప్రత్యక్షంగా ఎటువంటి సంబంధం కలిగిలేకున్నా, పరోక్షంగా రూజ్‌వెల్ట్‌కి హిట్లర్ పై వైరం వుంది. దానికి కారణం అమెరికాలో వున్న అన్ని సంస్థలను నాజీలు పాలించటం లేదా నాజీల అవసరాలకు వాటిని వినియోగించుకోవడమే. జర్మనీ సేనలు మాస్కో బయట వుండి నెలల తరబడి రష్యా సేనలతో ఘోరమైన యుద్ధం చేస్తుంటాయి. రష్యాకు మద్దతు అవసరమవుతుంది. అమెరికా ఆ మద్దతునిస్తుంది.

ఈ రోజుల్లోనే చార్లీ చాప్లిన్ జీవితంలో మరొక కష్టకాలం మొదలవుతుంది మాజీ అమెరికన్ రాయబారి జోసెఫ్ డేవిస్ రష్యాకు మద్దతుగా ఒక సభలో మాట్లాడవలసివుంది. ఆయన అకస్మాత్తుగా అనారోగ్యం చెందడంతో ఆయనకు బదులుగా చార్లీని మాట్లాడమని కోరుతారు. చార్లీ మాట్లాడ్డానికి అంగీకరిస్తాడు. శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన పదివేలమంది గొప్పవాళ్ళ సభలో చార్లీ ప్రముఖ ప్రసంగం చేయాలి. నాలుగు నిమిషాలైనా సరిగా మాట్లాడే ధైర్యంలేని చాప్లిన్‌ను కనీసం ఒక గంటైనా మాట్లాడమన్నారు. చార్లీకి చెమటలు, కాళ్ళుచేతులు ఆడలేదు. అయినా ధైర్యంచేసి ప్రసంగం మొదలుపెట్టాడు. "కామ్రేడ్స్" అని సంబోధించాడు. హాలులో ఉన్న వాళ్ళందరూ పెద్దగా విరగబడి నవ్వారు! తర్వాత ప్రసంగంలో తాను కమ్యూనిస్టుని కానని, మానవ మాత్రుడనని, కమ్యూనిస్టులుకూడా మానవులేనని, కమ్యూనిస్టు మాత రోదనైనా ఏ చనిపోయిన వానితల్లి రోదనైనా ఒకే మాదిరిగా వుంటుందనీ, దీన్ని అర్థం చేసుకోవటానికి ఎవరూ కమ్యూనిస్టు కానక్కరలేదనీ, మానవ మాత్రుడైతే చాలు నంటూ, మానవత్వాన్ని గూర్చి ప్రసంగించాడు. రష్యన్లు మన మిత్రులే, వారికి ధనసహాయం చేస్తే సరిపోదు, వాళ్ళజీవితాలను కాపాడుకోవటానికే వాళ్ళు యుద్ధం చేయటంలేదు. మనందరి జీవిత విధానాలను కాపాడటం కోసం వారు పోరాడుతున్నారు. కనుక అమెరికన్లు రష్యన్లకు సహాయంచేయాలి. దానికోసమే సెకండ్ ఫ్రంట్‌ను ప్రారంభించాల్సిన అవసరం వుందని ఉద్ఘాటించాడు. ఏడు నిమిషాలపాటు కరతాళ ధ్వనులు,

మెచ్చుకోలు శబ్దాలతో సభ ప్రతిధ్వనించింది. అందరూ ఉత్తేజితులౌతారు. ఉత్సాహంతో తమ టోపీలను ఎగరవేస్తూ, బల్లలమీద ధ్వనులు చేశారు. గాలి వేడెక్కింది. చాప్లిన్ ధైర్యానికి మెచ్చుకొని అభినందనలు తెల్పితే, చార్లీ తానెందుకు ఈ రాజకీయ రంగంలో కాలు పెట్టానా అని ఆందోళన చెందాడు.

తర్వాత కొన్ని వారాలకు న్యూయార్క్‌లోని మాడిసన్ స్క్వేర్‌లో 60 వేల మంది గుమిగూడారు. 250 కార్మిక సంఘాలవారు ఆ సభను ఏర్పాటు చేశారు. రష్యాయుద్ధభూమి మీద ప్రజాస్వామ్యం నిలుస్తుంధా? చస్తుందా? అన్న విషయంమీద 14 నిమిషాలపాటు కాలిఫోర్నియానుండి.టెలిఫోన్ ప్రసంగం చేశాడు చార్లీ. ఈ ప్రసంగం ప్రచురణ అయి చాలా ప్రసిద్ధి గాంచింది. ఆ ప్రసంగ సారమిది :

మిత్రదేశాల భవిష్యత్తు రష్యన్ కమ్యూనిస్టు చేతుల్లోవుంది. ఒకవేళ రష్యా ఓడిపోయినట్లయితే ప్రపంచంలో సారవంతమైన ఆసియా ఖండం నాజీల చేతుల్లోకి పోతుంది. తూర్పుదేశాలన్నీ జపాను చేతుల్లోకి పోతుంటే ప్రపంచంలోని యుద్ధ వనరులన్నీ నాజీలకు అందుబాటులో వుంటాయి. అప్పుడు హిట్లర్‌ను ఓడించటానికి మనకు అవకాశం వుండదని ప్రసంగించాడు.

రవాణా సౌకర్యాలు లేక ఉక్కు, నూనె, రబ్బరు సమస్యలు, హిట్లర్ విడగొట్టి జయించు ఎత్తుగడకు రష్యా ఓడిపోతే మనం బాధలకు గురికావలసి వస్తుంది. ప్రజాస్వామ్యం నిలబడాలంటే రష్యా ఓడిపోకుండా చూడవలసిన బాధ్యత మిత్ర దేశాల మీద వుంది. మన ప్రపంచం, నాగరికత మన కాళ్ళకింద కుంగి పోతుంటే మనం చూస్తూ ఎలా వుంటాం? నాజీ తోడేళ్ళు గొర్రెల మందలను కబళిస్తాయి. జాగ్రత్తగా వుండాలి. నాజీ శాంతి ఎత్తుగడలకు లొంగిపోతే దాని సిద్ధాంతానికి లొంగి పోయినట్లే. అపుడు మనకు బానిసత్వం సిద్ధస్తుంది. మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను మంట కలిపి నాజీలు మనపై అధికారం పొందుతారు. గెస్టపో ప్రపంచాన్ని పాలిస్తుంది. గాలిలో వుండే భవిష్యత్తులో వాళ్ళు మనల్ని పాలిస్తారు. గగనం వాళ్ళ చేతుల్లో వుం(దం)టే నాజీ వ్యతిరేకులను వాళ్ళు తుడిచిపెడతారు. ఎవరికీ హక్కులుండవు. మానవ ప్రగతి ఉండదు. అంతా తుడిచిపెట్టుకుపోతుంది. శాంతివాదులతో మనం చేయికలపకపోతే, విజయుడై హిట్లర్ ప్రపంచాన్నంతా తన దుర్మార్గానికి బలిచేస్తాడు. అందుకని, రష్యా విజయం కోసమై మీరంతా ఫ్యాక్టరీలలో, పొలాలలో, ప్రపంచ పౌరులందరూ పనిచేయాలి. అమెరికా, బ్రిటీషు, ప్రభుత్వాలు ఈ లక్ష్యంకొరకు మద్దతునివ్వాలి. అసాధ్యమైనదైనా పోరాడవలసి ఉంది అని ప్రజలకు ప్రభుత్వాలకూ ఉద్బోధిస్తాడు-చార్లీ చాప్లిన్. కొన్ని నెలల

తర్వాత అమెరికా సెకండ్ ఫ్రంట్ తెరవాలని న్యూయార్క్‌లో మళ్లా ప్రసంగిస్తాడు.

నాజీ వ్యతిరేక ప్రసంగాలవల్ల న్యూయార్క్‌లో చాప్లిన్ సామాజిక జీవితానికి కష్టాలొచ్చాయి. చాలా మంది చార్లీతో దూరంగా జరిగి కలవడం తగ్గించారు. ఈ రాజకీయాలలో ఎందుకు తలదూర్చవలసి వచ్చిందా అని, గ్రేట్ డిక్టేటర్ చిత్రం తీయకుండా వుండవలసిందనీ, సినీ కళాకారుడుగా ప్రజలకు దగ్గరగా వుండాలా? అని ఎన్నోవిధాలుగా ఆలోచిస్తాడు. ఏమైనా గాని తాను నాజీ వ్యతిరేకినని ధృవపరుచుకుంటాడు.

## చాప్లిన్ వివాహాలు

ది గోల్డ్‌రష్ చిత్రం తీసే రోజులలో నవంబర్ 1924 16 సంవత్సరాల నటి లిటాగ్రే (లొలితామాక్ మగ్రే)తో చార్లీ రెండవ వివాహం జరుగుతుంది. ఈ వివాహాన్ని గురించి చాప్లిన్ తన స్వీయ చరిత్రలో రెండు వాక్యాలు మాత్రమే వ్రాశాడు. ఈ వివాహానికి ఏ మాత్రం ప్రాధాన్యత చూపించడు. ఈ వివాహం ఆయన్ను గాఢంగా బాధపెట్టింది. 1927 డిసెంబర్ లో విడాకులు తీసుకున్నారు. అప్పటికే యిద్దరు మగ పిల్లలు పుట్టారు. లిటాగ్రే, ఆమె తల్లీ చాప్లిన్ సినిమాలలో పాత్రలు ధరించేవారు. ది గోల్డ్ రష్ చిత్రం కోసం లిటాగ్రేని వారానికి 75 డాలర్ల వేతనంతో నియమించి, ఆమెతో సరసాలాడిన ఫలితంగా ఆమె గర్భవతి అవుతుంది. కనుక వెంటనే పెళ్ళి చేసుకుంటాడు. మొదటి వివాహం కూడా యిదే విధంగా జరిగింది. చాప్లిన్‌కి ఆమెకి ఎప్పుడూ పడలేదు. విడాకులకు అర్జీ పెట్టుకుంటారు. ఆమె విడాకుల దావా 42 పేజీలుంది. అనేక విధాలుగా చాప్లిన్‌పై నిందలుమోపి ఆయన ఆస్థి వివరాలన్నిటిమీద ఆంక్షలు విధించటం జరిగింది. విడాకుల దావా పత్రాలను అచ్చువేసి ప్రతిని 25 సెంట్స్‌కు బజార్లలో తిరిగి తిరిగి అమ్మారు. కొన్ని రాష్ట్రాలలో చాప్లిన్ సినిమాలు చూడవద్దని కూడా ప్రచారం చేశారు. "ది సర్కస్" చిత్రాన్ని తీయటం కొంతకాలం ఆపవలసి వచ్చింది. అనేక రకాల గొడవలు భరించలేక న్యూయార్క్ పారిపోయాడు. అక్కడ మానసికంగా కుంగిపోయాడు. కొన్ని నెలల దాకా మంచాన పడ్డాడు. తన కళా జీవితానికి అంతిమ దినాలనుకుంటాడు. ఏమైనా దాదాపు సంవత్సరానికి ఆగస్టు 1927లో విడాకులపత్రం దొరుకుతుంది. పది లక్షల డాలర్లు తన భార్యకు, పిల్లలకు యివ్వవలసి వచ్చింది. పిల్లలను మట్టుకు భార్య దగ్గరే వుంచారు. తర్వాత రోజుల్లో

కొడుకులు చార్లీతోనే ఉండేవారు. అలా విషాదకరమైన చార్లీ రెండవ వివాహ గాథ ముగుస్తుంది.

తర్వాత 1930లో పాలెట్ గొడ్డార్డ్‌తో ప్రేమ వ్యవహారాలు సాగించిన వారిద్దరిని గురించి అమెరికా పత్రికా ప్రపంచంలో అనేక వదంతులు, పుకార్లు దుమారాలు లేచిన తర్వాత 1936లో పెళ్లి చేసుకుంటారు. ఇది చార్లీ మూడవ వివాహం. పాలెట్ చార్లీతో మోడర్న్ టైమ్స్‌లో, ది గ్రేట్ డిక్టేటర్‌లో నటించింది. చార్లీ కొడుకులను, చార్లీని ఎంతో ప్రేమగా, ఆదరంగా చూచుకొన్నా, ఆమె వేరే సినిమాలలో కూడా నటిస్తుండటం వల్ల, చార్లీ యొక్క ప్రత్యేక మానసిక పరిస్థితులతో ఆమె వేగలేక 1940లో విడాకులు తీసుకున్నారు. అప్పటికి చార్లీకి 51 సంవత్సరాలు. చార్లీ చాలా బాధపడ్డాడు. ముఖ్యంగా తన కుమారులను ఆమె చాలా చక్కగా చూచేది. చార్లీ కంటే ఆమె విడాకులు తన కొడుకులనే బాధించిందంటాడు. చాప్లిన్ మూడవ వివాహం అలా ముగుస్తుంది. మొదటి రెండు వివాహాల మాదిరిగా ఏ విధంగా నష్టపడకపోయినా, పాలెట్ గొడ్డార్డ్ గొప్పనటి, వ్యక్తిత్వం కలది కాబట్టి, ఆమెతో విడాకులు ఆయనకు బాధ కలిగించింది. అమెరికా సినీ జీవితంలో ఇవన్నీ మామూలే!

ది గ్రేట్ డిక్టేటర్ చిత్రం తర్వాత 'ది షాడో అండ్ ది సబ్‌స్టెన్స్' (The Shadow and the Substance) చిత్రం తీద్దామనుకున్నాడు చార్లీ. 25,000 డాలర్లు పెట్టి స్క్రిప్టు కొన్నాడు. వారానికి 250 డాలర్లకు జాన్ బారీ అనే నటిని నాయిక వేషం కొరకు నియమించాడు. ఆమెను నటించటం నేర్చుకొని రమ్మని తన స్వంత ఖర్చుమీద యాక్టింగ్ స్కూల్‌లో చేర్పించాడు. తాను కొన్ని నెలల పాటు స్క్రీన్‌ప్లే వ్రాయటంలో గడుపుతాడు యాక్టింగ్ స్కూల్‌లో నటన నేర్చుకురమ్మని జాన్ బారీని పంపితే ఆమె చార్లీ చాప్లిన్‌ని చాలా యిబ్బందులు పెట్టింది. జీవితంలో అతడు అన్ని కష్టాలు ఎన్నడూ పడలేదు. ఆమెతో చాప్లిన్ కొంత చనువుగా తిరగటంతో ఇంటికి వచ్చి అల్లరిపెట్టేది. అర్ధరాత్రులు తప్పతాగి వచ్చి తలుపులు తీయకపోతే కిటికీ తలుపులు పగులకొట్టేది. ప్రజల్లో తిరగకుండా, చాప్లిన్ గౌరవానికి భంగం కలిగించేట్లు ప్రవర్తించేది. చివరికి అనేక రకాలుగా విసిగి పోలీసులను బ్రతిమిలాడి, రెండుసార్లు 5,000 డాలర్లు ఖర్చు పెట్టి ఆ పిల్లను వాళ్ళ వూరికి పంపించి వేశాడు. అదొక విషాధ గాథ. ఆ రోజుల్లో చాప్లిన్ జీవితం చాలా గందరగోళంలో పడింది రాజకీయంగా కమ్యూనిస్టు అని, అమెరికా ప్రభుత్వం, పాత్రికేయులు ప్రజలలో ఒక వర్గం ఆయన మీద కత్తిగట్టింది. సంసారిక జీవితంలో

శాంతిలేదు. స్వతహాగా తాను అశాంతితో గడుపుతుండేవాడు. తప్పంతా ఏమిటంటే స్త్రీలతో అతి సన్నిహితంగా తిరగటమే!

ఈ రోజుల్లోనే ఆర్సన్‌వెల్స్ అనే అతడు చాప్లిన్ యింటికి వచ్చి, తాను వాస్తవ జీవితకధలు ఆధారంగా కొన్ని డాక్యుమెంటరీ చిత్రాలను తీయాలనుకుంటున్నానని, మొదట ప్రఖ్యాత ఫ్రెంచి హంతకుడైన బ్లుబియర్డ్ లాండ్రు జీవితంమీద సినిమా తీయాలనుకుంటున్నానని చెప్పాడు. చాప్లిన్ ఈ విషయం విని హాస్య వినోద చిత్రాలకు బదులు కొంచెం మార్పుగా వుంటుందని "కధవుందా" అని అడుగుతాడు. "ప్రభుత్వ రికార్డుల నుండి కథను సేకరించాలని" జవాబు. "అయితే నాకక్కర లేదంటాడు" చాప్లిన్. అంతటితో ఆ విషయం అయిపోయిందనుకుంటాడు. కాని రెండురోజుల తర్వాత చాప్లిన్‌కి ఒక ఆలోచన వస్తుంది. లాండ్రు జీవితం ఆధారంగా వ్యంగ్య వినోద చిత్రం తీయవచ్చునని ఒక అద్భుతమైన భావన కలిగింది. దాంతో వెల్స్‌కి టెలిఫోన్ చేసి తాను ఆ భావన కలిగించినందుకు 5,000 డాలర్లు యిస్తానని తర్వాత సినిమాతో ఎటువంటి సంబంధం లేకుండా ఒప్పందం వ్రాయించుకుంటాడు.

దీనితో The Shadow and Substance చిత్రాన్ని పక్కకి పెట్టేసి, వెల్స్ కలిగించిన ఆలోచనలతో మన్స్యువెర్డ్ (Monsieur Verdoux) చిత్రానికి కధ వ్రాయడం ప్రారంభిస్తాడు. కొన్ని నెలల తర్వాత మిన్నావాలిన్ అనే ఆమె హాలీవుడ్ సినిమా ఏజంట్ టెలిఫోన్ చేసింది. Shadow and Substances లో నాయికగా నటించటం కోసం ఒక అమ్మాయి వుందని పరీక్షించి చూడమని చెప్తుంది. ఆ టెలిఫోన్ పిలుపు చాప్లిన్ జీవితంలో ముసురుకున్న నీలినీడలను తొలగించి వెలుగును చూపుతుంది. ఆ అమ్మాయి పేరు ఊనా వోనీల్. ఆమెను చూశాడు. 17 సంవత్సరాల బాల. చాలా అందంగా బాగుంటుంది. కాని Shadow of Substance సినిమా నాయిక పాత్రకు మరీ చిన్నదనిపించింది. నాయికకు కావలసిన వయస్సు, అనుభవం లేదని వద్దంటాడు. కొన్ని రోజుల తర్వాత హాలీవుడ్ సినిమా ఏజెంట్ నుండి మళ్ళీ టెలిఫోన్ వచ్చింది. ఆ అమ్మాయిని ఫాక్స్ ఫిలిం కంపెనీవాళ్లు కావాలంటున్నారు. మీరేమంటారని? ఆ అమ్మాయి తన చిత్రానికి పనికిరాకపోయినా, ఆమెని వదులుకోలేక అప్పటికప్పుడే ఆ అమ్మాయిని తన స్టూడియోలో నియంమించుకుంటాడు. ఆ రోజున చాప్లిన్ తన భవిష్యత్ జీవితాన్నంతా దాదాపు 30 సంవత్సరాలు ఆమెతోనే సుఖంగా గడపాల్సి వస్తుందని చార్లీకి తెలియదు. అందుకనే చార్లీ తన స్వీయ చరిత్రలో "కొందరు

దార్శనికులు జీవిత మొక అర్థ స్వప్నమని, స్వప్నం ఎక్కడ అంతమవుతుందో, ఎక్కడ వాస్తవ జీవితం ప్రారంభమవుతుందో తెలియదంటారు" అని వ్రాస్తాడు. అటువంటి పరిస్థితుల్లోదే తన జీవితం కూడానని చాప్లిన్ భావిస్తాడు.

ఊనా వోనీల్ చాప్లిన్‌ని చాలా ఆకర్షించింది. ఆమెలోని హాస్యం, ఓర్పు యితరుల దృక్పథాన్ని అర్థంచేసుకోవడంలో నేర్పు, ఇంకా అనేక సుగుణాలవల్ల ఆమెను చాప్లిన్ ప్రేమించాడు. ఆమె కపుడు 18 సంవత్సరాలే ! చార్లీ చాప్లిన్ నడివయస్సుదాటి 54లో పడ్డాడు. అయినా వయస్సుతో సంబంధం పెట్టుకోలేదు. ఊనా! Shadow and Substance సినిమా అయిపోయిం తర్వాత పెళ్ళి చేసుకుందామని నిశ్చయించుకుంటారు.

ఇదే రోజుల్లో జీవితంలో నీలిచ్ఛాయలు మళ్ళీ ముసురుకుంటాయి. పోలీసులతో గెంటబడిన జాన్‌బారీ నాయిక తిరిగి మళ్లీ వచ్చి, తను దిక్కు లేకుండా వున్నానని, మూడు నెలల గర్భవతిననీ, చాప్లిన్‌ని అల్లరి చేయడం మొదలుపెట్టింది. ఆమె కబుర్లు విని పత్రికలవాళ్ళు కథలల్లారు, ఆమెకు పుట్టబోయే బిడ్డకు తండ్రి చాప్లిన్ అని, పత్రికలలో వ్రాశారు. ఒక వారం రోజుల తర్వాత ఆమెలో వున్న బిడ్డ తండ్రి చార్లీయేనని కోర్టులో పితృత్వ దావా వేసింది. ఆమె ఆరోపణలన్నింటికి తనకు సంబంధంలేదని చాప్లిన్ వాదిస్తాడు. ఎన్ని అవమానాలు పాలయినా ధైర్యంగా ఎదుర్కోవటానికి సిద్ధపడ్డాడు.

ఈ పరిస్థితుల్లో ఎవరికీ తెలియకుండా ఒక చిన్న గ్రామంలో ఊనాని పెళ్ళి చేసుకుంటాడు. పత్రికలవాళ్లకు తన సంగతి తెలియకుండా రెండునెలలపాటు బయటపడ్డాడు. అయినా కూడా జాతియావత్తూ తనని అనుమానిస్తూ అసహ్యించుకుంటుందని చిత్ర జగత్తుకు తనకిక సంబంధం తెగిపోయిందేమోనని ఆందోళన చెందుతుండేవాడు. లాస్ ఏంజిలిస్‌కు తిరిగి రాగానే సుప్రీంకోర్టు న్యాయమూర్తి చార్లీ మిత్రుడు మర్ఫీ విచారకరమైన వార్తలు అందించాడు. ప్రముఖ రాజకీయ నాయకులు కొందరు చాప్లిన్‌ని పితృత్వ దావా కేసులో ఇరికించాలని అనుకుంటున్నారని పెద్ద వకీలుపై డబ్బు ఖర్చు పెట్టకుండా ఒక చిన్న లాయరును పెట్టుకోమని సలహా ఇచ్చాడు. కొంతకాలం తర్వాత అమెరికా ప్రభుత్వం కోర్టులో దానిపై విచారణ ప్రారంభించింది. పత్రికలవాళ్ళు కట్టుగా చాప్లిన్‌ని ఒక క్రూరుడుగా చిత్రించారు ఈ కేసు విషయంలో అమెరికా ప్రభుత్వానికి సంబంధం లేదని వాదించటానికి తయారవుతారు. చాప్లిన్ లాయరు బారీ కడుపులోనున్న బిడ్డ

రక్తం పరీక్ష చేయిస్తే చాప్లిన్ నిర్దోషిత్వం బయటపడుతుందని బారీ లాయర్‌తో ఒక ఒప్పందం ఏర్పరచుకుంటాడు దాని ప్రకారం 25,000 డాలర్లు యిస్తే. బారీ తన బిడ్డ రక్తం పరీక్ష చేయించుకుంటారు. రక్తం పరీక్షలో చార్లీకేమీ సంబంధం లేదని తేలిందంటే అంతటితో ఆ కేసు సరి-కాని అదేమి కుదరలేదు. వారికి బిడ్డపుట్టిన తర్వాత న్యాయమూర్తుల సంఘం నేర విచారణ సాగిస్తుంది. ఈసారి అమెరికా ప్రభుత్వం కేసును వేరే విధంగా మార్చింది. అమెరికా ప్రభుత్వానికి రాజకీయ వ్యతిరేకియైన చార్లీ చాప్లిన్‌ను చట్టబద్ధంగా బ్లాక్‌మెయిల్ చేసి అగౌరవపరచాలనే ఉద్దేశంతో Mann Act ని ఉల్లంఘించాడని ఆరోపించింది. ఆ చట్టరి ప్రకారం ఒక రాష్ట్రం నుండి యింకో రాష్ట్రానికి పడుపువృత్తి కొరకై స్త్రీలను తేరాదు. ఆ రోజలలో ఆ చట్టం అమలులో లేకపోయినా కొందరిని శిక్షించడానికన్నట్లు వాడేవారు. ఆ శాసనం ప్రకారం విడాకులిచ్చిన భార్యతోనైనా ఒక రాష్ట్ర సరిహద్దునుండి యింకొక రాష్ట్ర హద్దులోనికి ప్రవేశించేటప్పుడు సంభోగించినా అది శాసనోల్లంఘనమేనట ! దానికి శిక్ష ఐదు సంవత్సరాల కారాగారం. ఇటువంటి మాయదారి శాసనం కింద అమెరికా ప్రభుత్వం చాప్లిన్‌పై నేరారోపణకు పూనుకుంది. చాప్లిన్‌కి ఏమీ అర్థం కాలేదు. స్నేహితుల సలహాపై ఒక పెద్ద క్రిమినల్ లాయరును తన తరపున వాదించటానికి పెట్టుకున్నాడు. ఈ తప్పుడు కేసుకు ఆసరాగా యింకో తప్పుడు కేసు బనాయించి చాప్లిన్‌ను యిరుకులో పెట్టాలని చూసింది ప్రభుత్వం. కాని తర్వాత ఆ కేసును ఉపసంహరించుకున్నది.

చార్జిషీటు దాఖలు అయింది. కేసు విచారణ ప్రారంభమైంది. నేరారోపణ ప్రాథమికంగా కోర్టు అంగీకరించింది. తన స్వేచ్ఛకోసమై చాప్లిన్ పెద్ద పోరాటం జరపవలసి వచ్చింది. నేరారోపణలు మొత్తం రుజువైతే 20 సంవత్సరాల కారాగార శిక్ష అనుభవించవలసి వచ్చేది.

బారీ బిడ్డకు రక్త పరీక్ష జరపగా చార్లీకి సంబంధం లేదని తేలింది. దీంతో ప్రభుత్వం గౌరవం దెబ్బతిన్నా, కేసు వదిలిపెట్టకుండా నడిపింది. శాన్ ఫ్రాన్సిస్కో నుండి ఒక కాథలిక్ మత గురువు ఒక ముఖ్యమైన ఉత్తరం వ్రాశాడు చాప్లిన్‌కి. అందులో బారీని ఫాసిస్ట్ సంస్థ నియమించిందని, కావాలంటే లాస్ ఏంజిలిస్ వచ్చి సాక్ష్యం యిస్తానని వ్రాశాడు. చాప్లిన్ లాయరు ఆ సాక్ష్యం అవసరం లేదంటాడు.

అమెరికా ప్రభుత్వం, ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ FBI అన్ని విధాల సాక్ష్యాలను సమకూర్చటానికి ప్రయత్నాలు చేశారు కొన్ని నెలలు విశ్రాంతి లేకుండా చాప్లిన్ లాయరు పనిచేయవలసి వస్తుంది. అమెరికా ప్రజల్లో తన పరువు

నిలబెట్టుకోవాలని, తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాలని చాప్లిన్ బాధపడ్డాడు. అప్పటికే అమెరికా పత్రికలు చాప్లిన్ గురించి పట్టించుకోవటం మానివేశాయి.

ఎన్నో నెలలు విచారణ జరిగింది. ఏ ఆరోపణ ఋజువు కాలేదు. చార్లీ చాప్లిన్ నిర్దోషి అని కోర్టు తీర్పు ఇచ్చింది. అయితే ఎన్నో నెలల తీవ్రమైన ఆందోళన, బాధల తర్వాత బయటపడ్డాడు చాప్లిన్.

"జాతి యావత్తుమీద రాజకీయ వ్యతిరేకతను చూపించిన సినిమా నటుడుగా అమెరికా చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తావని" చాప్లిన్‌తో ఒకాయన అన్నాడట! అమెరికా ప్రజలు, ప్రభుత్వంతో చాప్లిన్‌కిగల సంబంధం అటువంటిది!

కోర్టు తీర్పు తర్వాత కాలిఫోర్నియా నుండి పోయి, భార్యతో ఒకమారు మూల ప్రదేశంలో ఎవరికీ తెలియకుండా ఏడువారాలు గడపాల్సి వస్తుంది. నేర విచారణ అవమానం నుండి త్వరగా బయటపడలేకపోయాడు. తన సృజనాత్మకశక్తి దెబ్బతిన్నట్టుగా భావిస్తాడు. కాలిఫోర్నియాకి తిరిగివచ్చి మన్స్యూ వెర్డో చిత్రాన్ని పూర్తి చేయటానికి వుపక్రమించాడు. పన్నెండు వారాలలో మొత్తం చిత్రాన్ని పూర్తిచేశాడు.

## మన్స్యూ వెర్డో (Monsieur Verdoux)

మన్స్యూ వెర్డో చిత్రం కథ టూకీగా యిది : వెర్డో ఒక చిన్న బ్యాంకు గుమాస్తా. అర్థికమాంద్యపు రోజుల్లో ఉద్యోగం పోతుంది. కనుక బ్రతకటం కోసం ఒక పధకాన్ని తయారుచేస్తాడు. పెళ్ళికాని వృద్ధ స్త్రీలను పెళ్లాడటం, వారివద్ద నున్న ధనాన్ని కాజేసి వారిని చంపివేయటం. వెర్డో అసలు భార్య రోగిష్టిది. చిన్న కొడుకుతో పల్లెటూళ్ళో వుంటుంది. భర్తచేసే నేరాలు ఆమెకు తెలియవు. వెర్డో హత్యలు చేసొచ్చి, పగలంతా చాలా కష్టపడి వచ్చినవాడుగా యింట్లో ప్రవర్తించేవాడు. అతనొక వింత మనిషి, మంచీ చెడు లక్షణాల కలయిక, ఎవరికీ హానిచేయనట్లే కనపడతాడు. కాని భయంకర నేరస్తుడు. ఈ చిత్రంలో భయంకర హాస్యం, క్రూర వ్యంగ్యం, సామాజిక విమర్శ వుంది సామాన్య మానవులు సరైన పనిదొరకక, సమాజం పని చూపకపోయినట్లయితే ఈ అమానుష సమాజంలో అసహజమైన నేరాలు జరుగుతాయనేది, నాగరిక ప్రపంచంతో వెర్డో యుద్ధం చేస్తాడు. వెండితెరమీద వెర్డో చేసే హత్యలు కొందరికి ( సౌఖ్యంగా

వుండేవారికి) జుగుప్సాకరంగా వుండవచ్చు. ఆ జీవిత సమరంలో కొన్ని హత్యలు చేస్తాడు. ఆవిధంగా అమానుషమైపోతున్న నవనాగరిక సమాజం, వ్యక్తుల్ని నేరాలు చేయటానికి ప్రోత్సహిస్తుంది అని చెప్పే సామాజిక వ్యంగ్య రూపం ఈ చిత్రం.

చాప్లిన్ ఒకసారి ఒక చిత్రకారిణితో (విధవ) వినోద విహారాలు సాగిస్తాడు. అప్పుడు ఆమె చాప్లిన్ ఊర్ధ్వభాగాన్ని (Bust) ను చిత్రీకరిస్తుంది. చిత్రం అయిపోయిన తర్వాత ఎలావుంది? అని అడుగుతుంది ఆమె. "పెద్ద హంతకుడిలాగుంది" అని చాప్లిన్ సమాధానం. కాదు, "ఒక కళాకారుని చిత్రమంటుంది" ఆమె. కళాకారునికీ హంతకునికీ పెద్ద తేడా వుండదు. ఇద్దరూ ఒకే మనస్తత్వం కలవాళ్ళు. ఉభయుల మనసులు ఎప్పుడూ వురకలు వేస్తుంటాయ్, భగభగ మండుతుంటాయ్, ఏదో చేయాలని తపన వుంటుంది. చట్టానికి వ్యతిరేకంగా నడుచుకుంటారు. వాళ్ళ జీవితాన్ని వాళ్ళే నిర్ణయించుకుంటారు అని కళాకారునికీ, హంతకునికీ సామ్యాలు వర్ణిస్తాడు చాప్లిన్. ఈ ఆలోచన నుండే వెలువడిందిగా కనపడుతుంది మన్స్యూ వెర్డో చిత్రం.

మన్స్యూ వెర్డో ఒక హంతకుని వినోదగాథ. ఒకరకంగా ఈ చిత్రాన్ని గురించి చెప్పలేం. అది సంక్లిష్టమైన కథ. మానవుడు ఏం చేయలేని పరిస్థితుల్లో చేసిన పనులకు అతనిమీద సానుభూతి, దయ, జాలి చూపాలి అన్నట్లు, ఈ చిత్రాన్ని రూపొందిస్తాడు. వెర్డో సినిమాలో నాలుగు హత్యలు చేసినా అతడు మనిషిగానే వుంటాడు. అవసరమైన సహాయం చేస్తాడు. తన భార్యా బిడ్డలను చూచుకుంటాడు. భార్యబిడ్డల పోషణార్థం ధనార్జన కోసం మాత్రమే హత్యలు చేస్తాడు వెర్డో. మధ్యతరగతి వ్యక్తి మనస్తత్వాన్ని ఎత్తి చూపుతుంది ఈ చిత్రం. మధ్యతరగతిలో వుండే వైరుధ్యాలను (Contradictions) చూపుతుంది. మధ్యతరగతి జీవకారుణ్యంలో విశ్వాసం కలిగివుంది. యుద్ధాలనూ ఆమోదిస్తుంది ! నీతిలోనూ విశ్వాసం ఉంచుతుంది. వ్యాపారాన్నీ ఆమోదిస్తుంది ! మధ్యతరగతి గుర్తించవలసిన నీతులన్నింటిని మధ్య తరగతికి చెందిన వెర్డో మాటలద్వారా మనకి వినిపిస్తాడు చార్లీ. ఉదాహరణకు :

"వ్యాపారం ఎప్పుడూ తప్పుడు వ్యాపారమే."

"క్రౌర్యం విస్తృతంగా ఆచరణలో పెడితే తప్పు ఫలించదు"

"ఒకరిని చంపటం, హత్య ! అనేకులను చంపటం పరాక్రమం."

"పాపాత్ములు ప్రపంచంలో లేకపోతే మత గురువులేం కావాలి !"

"ఆత్మకు క్షాళన అవసరం, అది భగవంతుడిలో భాగం"

“నా పేచీ దేవుడితో కాదు, మనుష్యులతో” ఇలా మన్స్యూ వెర్డో నోటిద్వారా పలికిస్తాడు. ఈ భావాలు సభ్య ప్రపంచ పౌరులకి మింగుడుపడవు చాప్లిన్‌పై విరుచుకుపడతారు.

సమాజం రోజు రోజుకి పెరిగిపోతున్న నేరాలకు, హత్యలకు ప్రతిబింబం. ఎక్కడ చూచినా యుద్ధాలు. వీటన్నిటినీ రూపుమాపటానికి సమాజం, ప్రభుత్వాలు ఎటువంటి చర్యలు తీసుకోకపోగా, వాటన్నిటిని సమర్థించినట్లు కిమ్మనకుండా చూస్తూవూరుకుంటాయి. జీవితంలో యివన్నీ ఒక భాగంగా పరిగణించినట్లు కనపడుతుంది. అటువంటి పరిస్థితులలో చాప్లిన్ పాత్ర ట్రాంప్ మట్టుకు ఎలా పెద్ద మనిషిలా, ఏమీచేయలేనివాడులా ఎందుకు వుండాలి? హత్యానేరాల సమాజంలో అతను మట్టుకు హత్యలుచేసి జీవించలేడూ ? అయితే తన ట్రాంప్ మానవతావాదాన్ని, ప్రేమానురాగాలను, కరుణా దయాదాక్షిణ్యాలను వదలి పెట్టకుండా, ఒక ప్రక్క హత్యలు చేస్తుంటాడు-రెండవపక్క జీవకారుణ్య ప్రదర్శన చేస్తుంటాడు. ఇటువంటి విచిత్ర మన: పరిస్థితిలోకి చాప్లిన్ పాత్ర ఎదుగుతుంది. సమాజపు వక్రమార్గాన్ని నేర ప్రవృత్తిని ఎండగడుతుంది, విమర్శిస్తుంది.

మన్స్యూ వెర్డో చిత్రానికి సెన్సార్‌షిప్ సర్టిఫికెట్ మొదట యివ్వలేదు ప్రదర్శన అనుమతి దొరకలేదు. చిత్రం సంఘ వ్యతిరేకమైనదని, సామాజిక జీవితాన్ని దుయ్యబడుతుందని, హంతకుడైన కథనాయకుడు ప్రసంగాల్లో యుద్ధాల్లో జరిగే సామూహిక హత్యల నీతి నియమాలను ప్రశ్నిస్తాడని, పైగా నీతి బాహ్యమైన లైంగిక వ్యవహారాలతో కథానాయకుని ప్రవర్తన అభ్యంతరకరమైనదని, మతాన్ని విమర్శిస్తుందని యింకా అనేక అభ్యంతరాలు చూపి చిత్రాన్ని రద్దుచేశారు చాప్లిన్ స్వయంగా ప్రతి మాటకు వివరణ యిచ్చిన తర్వాత, ఎంతో వాద వివాదం తర్వాత, అవమానాల తర్వాత స్క్రిప్టులో కొన్ని మార్పులు, చేర్పులు చేశాక, ఎట్టకేలకు సెన్సారు సర్టిఫికేటు దొరుకుతుంది. కాని చాప్లిన్ ఎన్నో బాధలకు, అవమానాలకు గురికావలసి వచ్చింది. తాను ఒంటరిగా భావిస్తాడు. జీవితంలో అడుగడుగునా అడ్డంకులే. మొదట చిత్రాన్ని రద్దుచేసి తర్వాత ఫర్వాలేదు విడుదల చేయవచ్చు అన్నారు. ఎందుకిలా చేస్తున్నారని చాప్లిన్‌కి అనుమానం వచ్చింది. అనుమానం వచ్చినట్టుగానే జరిగింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాల మార్షల్ కార్యాలయం నుండి టెలిఫోన్. అమెరికా వ్యతిరేక కార్యకలాపాల సంఘం (un-American Activities Committee) ముందు సంజాయిషి యిచ్చుకోవాలని వుత్తర్వులు, చాప్లిన్‌తోపాటు యింకా 19 మంది

అమెరికా జాతి వ్యతిరేకచర్యలకు పాల్పడుతున్నారని అభియోగం చార్లీ అన్నిటికి అమెరికాలో 40 సంవత్సరాలుగా వుంటున్నా అమెరికా పౌరసత్వాన్ని తీసుకోలేదు. బ్రిటీషు పౌరసత్వాన్నే ఆయన వుంచుకున్నాడు. ఆ కమిటీ వారు ప్రతిసారి ఫలానా అప్పుడు రమ్మనటం, మళ్ళా వాయిదా వేయటంతో చాప్లిన్‌కి విసుగొచ్చి వారికి ఈ విధంగా వ్రాశాడు.

"నేను కమ్యూనిస్టుని కాను." ఎప్పుడూ కూడా ఏ రాజకీయ పార్టీలోకాని సంస్థలో కాని చేరలేదు నేను శాంతి కాముణ్ణి. మీరు నానుండి పొందవలసిన సమాధానమిదే ననుకుంటా. నేనెపుడు మీ ముందు ఉండవలెనో నిర్దిష్టంగా తెల్పండి. కొన్ని రోజుల తర్వాత జవాబు వచ్చింది. కమిటీముందుకు రావలసిన అవసరంలేదని, దాంతో ఆ విషయం అప్పటికి ముగుస్తుంది.

మన్స్యూ వెర్డో చిత్రం బాక్సాఫీస్ విజయం సాధించినా ఒక కోటి యిరవై లక్షల డాలర్లు సంపాదించిపెట్టినా, ఆ చిత్రం అమెరికాలో పెద్ద సంచలనాన్ని సృష్టించి చాప్లిన్ వ్యతిరేకతను పెంపొందించింది. చిత్రం విడుదల అయ్యాక పాత్రికేయుల సమావేశం ఏర్పాటుచేయబడింది అమెరికాలో చాప్లిన్ వ్యతిరేకత ఎంత వుందో పాత్రికేయుల సమావేశ ధోరణిచూస్తే తెలుస్తుంది. పాత్రికేయుల ప్రశ్నలు, చాప్లిన్ సమాధానాలు .

మొదటి ప్రశ్న "మీరు కమ్యూనిస్టులా ?"

చాప్లిన్ సమాధానం "కాదు"

రెండవ ప్రశ్న : "అమెరికా పౌరుడివి ఎందుకు కాలేదు"

"జాతీయత మార్చుకునే కారణం నాకు కన్పడలేదు. నామట్టుకు నేను ప్రపంచ పౌరుడి ననుకుంటున్నాను అని చాప్లిన్ జవాబు.

"కాని ధనం అమెరికాలో సంపాదిస్తున్నావుగా" యింకొక ప్రశ్న.

"నా వ్యాపారం అంతర్జాతీయం. 70 శాతం నా ఆదాయం విదేశాలలో సంపాదించింది. అయినా అమెరికా నాఆదాయం మీద 100 శాతం పన్ను వేస్తుంది. ఆవిధంగా నేను ఆదాయాన్ని పన్నులుగా చెల్లించే మంచి అతిధిని" అంటాడు చాప్లిన్.

"మీకు హాన్స్ ఐస్లర్ తెలుసా ?"

"ఆయన నాకు మిత్రుడు, గొప్ప సంగీత విద్వాంసుడు"

"ఆయన కమ్యూనిస్టని మీకు తెలుసా ?"

"ఆయన ఏదైతే నాకేమీ ? మా మిత్రత్వం రాజకీయాల మీద ఆధారపడింది కాదు."

"అయినా కమ్యూనిస్టులంటే యిష్టం మాదిరిగా వుంది ?"

"నేనెవరిని యిష్టపడాలో, ఎవరిని అయిష్టపడాలో నాకెవరూ చెప్పనక్కర్లేదు. మనం అంతవరకు యింకా రాలేదు" చాప్లిన్ "అమెరికా ప్రెస్ ప్రతినిధివర్గం అనే కొందరు మిమ్మల్ని దూషిస్తూ, అసహ్యించుకుంటూ, తిట్టూ వుంటే ప్రపంచాన్ని సంతోష సముద్రంలోముంచిన గొప్ప కళాకారులైన మీకు అమెరికా ప్రజలను అర్థం చేసుకోవటం ఎలా ఉంది ?" అని ఒక పాత్రికేయుని ప్రశ్నకు చాప్లిన్ వ్యాఖ్యానించలేదు. దాంతో సమావేశం అయిపోగా, అమెరికాలో తన మీద పెరుగుతున్న వ్యతిరేకతను హృదయం బరువై, గుండె చెరువైందాంటాడు.

సినిమా హాళ్ళల్లో కూడా చాప్లిన్ సినిమాలు చూపిస్తున్నప్పుడు కొందరు కావాలని విచిత్రశబ్దాలు చేసేవారు ! సినిమా చూసినవ్వేవాళ్ళకు, ఆనందించేవాళ్ళకి వ్యతిరేకంగా అల్లరి చేసేవారు! అదంతా తనకు వ్యతిరేకంగా ఒక వర్గం చేయాలని చేస్తున్నదని చాప్లిన్ చాలా కుమిలిపోతాడు. మస్యూ వెర్డో న్యూయార్కులో ఆరువారాలపాటు బ్రహ్మాండంగా నడిచింది. అయితే 10 సంవత్సరాలుగా చాప్లిన్‌కు వ్యతిరేకంగా అమెరికన్ ప్రెస్ చేసిన వ్యతిరేక ప్రచారం వల్ల సినిమాహాళ్ళ వద్ద పికెటింగ్‌లు జరగటం వల్ల అంత బాగా సినిమా నడవలేకపోయింది

చాప్లిన్ అమెరికన్ కాదని, యూదు అని అమెరికా నుండి బహిష్కరించాలని, అమెరికా పౌరుడుగాకుండా, అమెరికా ధనాన్ని కొల్లగొడ్తున్నాడని, పెద్ద కమ్యూనిస్టని, అతన్ని రష్యాకు పంపాలని ఎన్నో అవాకులు, చెవాకులు అమెరికా పత్రికలు (న్యూయార్క్ డెయిలీ న్యూస్) మొదలయినవి వ్రాసినవి. ఈ వ్రాతలన్నీ చూచిన తర్వాత 'ప్రపంచమంతా ఎవరినైనా నిరాశపరుణ్ణి చేసినప్పుడు, బాధలన్నీ ఒక్కుమ్మడిగా వచ్చినప్పుడు అటువంటి దశలో ఎవరైనా నైరాశ్యం చెందకపోతే, వేదాంతంలోగాని, హాస్యంలోగాని పడక తప్పదు' అని చాప్లిన్ అనుకుంటాడు.

అమెరికాలో ఉన్న అన్ని పెద్ద సినిమాహాళ్ళ వారు మస్యూ వెర్డో చిత్రాన్ని బుక్ చేసినప్పటికి, అమెరికన్ లెజియన్ (American Legion) యితర ఒత్తిడి సంఘాలవారు వ్రాసిన బెదిరింపు ఉత్తరాలవల్ల ఆ థియేటర్లన్నీ ఆ సినిమా ప్రదర్శించలేమంటారు. కొన్ని థియేటర్లలో బాగా నడుస్తుంటే కూడా బాయ్‌కాట్

ప్రదర్శనలవల్ల సినిమా ప్రదర్శన రద్దుచేయటం జరిగింది. ఇంతకు ముందు ది నేషనల్ లెజియన్ ఆఫ్ డీసెన్సీ (The National Legion of Decency) కూడా ది గ్రేట్ డిక్టేటర్ సినిమా పిల్లలను చూడవద్దని ప్రచారం చేసింది. భగవంతునిలో ఆ విశ్వాసం చూపెట్టినందుకు పిల్లలను చూడనీయ వద్దంటారు !

ఇంతలోనే ది గ్రేట్ డిక్టేటర్ కాపీ చిత్రమని కేసు పెట్టటం, ప్రెస్ ప్రజలు తనను అసహ్యించుకొనేటట్లు ప్రవర్తించటం జరుగుతుంది నలుగురు సెనేటర్లు, సెనేట్‌లో చాప్లిన్ పై అప్రతిష్టాకరమైన నేరారోపణలు చేసి, నేర విచారణ జరుపుతారు. ఈ రభసంతా, తాము ప్రారంభించిన యునైటెడ్ ఆర్టిస్ట్ కంపెనీ అమ్ముకునే పరిస్థితికి వచ్చింది. ఇంత గొడవ జరుగుతున్నా చార్లీ ధైర్యంగానే వున్నాడు. అమెరికా ప్రజలు ఎంత హేళన చేసినా, కళా హృదయులనీ, హాస్యాన్ని ఆదరిస్తారని, మన్స్యూ వెర్డోకు వ్యతిరేకంగా ఒక ప్రేమకథ సినిమా తీయాలని నిర్ణయించుకుంటాడు. ఆ నిర్ణయ ఫలితమే "లైమ్ లైట్ "చిత్రం.

# "లైమ్ లైట్" (Lime Light)

18 నెలలు కష్టపడి ఈ చిత్రాన్ని తీశాడు. ఈ చిత్రం సంగీతానికి, నృత్యానికి ప్రాధాన్యత యిచ్చింది తానే సంగీతాన్ని సమకూర్చి, ప్రఖ్యాత బ్యాలే డాన్సర్సుతో నృత్యం చేయించాడు సినిమా పూర్తయిన తర్వాత తన సంగీతానికి తానే మురిసి పోయాడు. దాంతో అమెరికా ప్రజలు సాధించటం మరచి, నేరారోపణలు చేయటం మానివేశారు. ఈ లోపలనే తన నాలుగవ భార్యతో నలుగురి సంతానాన్ని కన్నాడు.

లైమ్ లైట్ చిత్రానికి నెలలు తరబడి కూర్చుని కథ వ్రాశాడు. దాదాపు 800 పేజీలు వ్రాశాడు ! ఈ చిత్రం చార్లీ అన్ని చిత్రాలవలె కాదు. ఇది విషాదాంతం. చార్లీ అతి సున్నితమైన, చమత్కారిగా, వినోదాన్ని హాస్యంతో కలిగిస్తూ, మానవ జీవితంలోని లోపాలను, నాగరిక జీవితాల్లోని కుళ్ళును తన ట్రాంప్ పాత్ర ద్వారా అతిసున్నితంగా విమర్శిస్తూ, అనేక చిత్రాలు తీశాడు. చివరికి ఆ పాత్ర విసిగి హంతకుడవుతాడు. (మన్స్యూ వెర్డోలో)(ఆఖరికి లైమ్ లైట్‌లో చార్లీ విదూషక నాయకత్వం, ట్రాంప్ హాస్య, వినోద, కరుణాత్మక పాత్ర అంతమవుతుంది. ఆ పాత్రను ఆయన చంపేస్తాడు. అది చార్లీ మరణంగానే భావించాలి అందుకనే లైమ్ లైట్ చిత్రం ట్రాజెడీగా తీశాడు

అయితే లైమ్ లైట్ చిత్రం చార్లీ చాప్లిన్ స్వీయ చరిత్రను గురించి తీసిందే ! లండన్ నగరంలో ఒక హాస్యగాని బాల్యం నుండి అవసాన దశదాకా ఉపాధి ప్రయత్నాలు ఎన్ని చేసినా సరైన వుద్యోగం దొరకదు. ఆ దశలో జీవితాంతం పడ్డ కష్టాలు, అంతులేని బాధలు, ఒంటరి జీవితం, చివరికి మరణం ఆవిధంగా జీవితంలో ఆశించినవి, ప్రయత్నించినవి, ఎదురైనవి, ఎదుర్కొన్నవి లభించినవి, లభించనివి, ఆశా నిరాశల వూగులాటలో తన జీవితాన్ని గురించి చెప్పటమే. ఆవిధంగా తన జీవితంలో ఇరవై సంఘటనల ఆధారంగా తీసిన చిత్రం ఇంతకు ముందు ఏ చిత్రంలో కూడా చాప్లిన్ జీవితాన్ని గురించి, యింత విపులంగా వివరించలేదు. చాప్లిన్ గాఢ, దయనీయ జీవితం, దుఃఖాన్ని కలిగిస్తుంది. చిత్రం పెద్దగా విజయవంతం కాకపోయినా, ఈ చిత్రం చాప్లిన్ జీవితానికి ఒక విజయం. తన జీవితాన్ని ఎలా ప్రారంభించాడో, ట్రాంప్ ముసుగులో జొరబడి సమాజం పోకడలను విమర్శించి, ముసుగు తీసి పారవేసి తన నగ్న జీవితాన్ని అందరి ముందూ పెట్టాడు. తాను హాస్యగానిగా చీకటి నీడల్లో కలిసిపోతాడు. సమాజంలోని ఒక కళాకారుని జీవితాన్ని ఈ చిత్రం ద్వారా ప్రదర్శిస్తాడు.

## చార్లీ అమెరికా నుండి బహిష్కరణ

అమెరికాలో చాప్లిన్ వ్యతిరేకత ముఖ్యంగా ప్రభుత్వం నుండి రోజురోజుకు ముదిరిపోతుంది. ఈ పరిస్థితుల్లో భార్యా బిడ్డలతో యూరప్ వెళ్ళిపోయి అక్కడే పిల్లలను చదివించుకోవాలని, హాలీవుడ్ ప్రభావానికి దూరంగా ఉంచాలని అనుకుంటాడు. అందుకని అమెరికాలో పునఃప్రవేశానికి అనుమతికై (Re-Entry Permit) ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకుంటాడు. మూడు నెలలయినా జవాబు రాలేదు. అయినా కూడా అన్ని వ్యవహారాలతో తెగతెంపులు చేసుకొని, కట్టవలసిన పన్నులన్నీ కట్టాడు. అయినా యింకా 20 లక్షల డాలర్లు పన్ను కట్టాలని ప్రభుత్వం వారు ఒక కథ అల్లగా, కావాలంటే కోర్టుకు పొమ్మంటాడు. దాంతో ప్రభుత్వం పన్ను ప్రతిపాదనలన్నింటినీ వదలుకుంటుంది. అమెరికా పునఃప్రవేశానికి అనుమతి యివ్వటం ఒక వేళ ప్రభుత్వానికి యిష్టం లేకపోతే అమెరికాను పూర్తిగా విడిచిపెట్టిపోతానని, ఏదో ఒక సమాధానం యివ్వవలసిందని మళ్ళీ వ్రాసిన వారం తర్వాత, కొన్ని ప్రశ్నలకు చాప్లిన్ నుండి సమాధానాలు కావాలని ఇమిగ్రేషన్ శాఖ అధికారులు చార్లీ వద్దకు వచ్చారు. వారు అడిగిన ప్రశ్నలు, చార్లీ సమాధానాలు చాలా విచిత్రంగా ఉన్నాయి.

"ఎప్పుడైనా మీరు కమ్యూనిస్టా ?"

"లేదు నేనెప్పుడూ ఏ రాజకీయ సంస్థలో చేరలేదు."

"ఒక ప్రసంగంలో కామ్రేడ్స్ అని సంబోధించారు, దాని అర్థమేమిటి ?"

"దాని అర్థం కావాలంటే డిక్షనరీ చూడండి. కమ్యూనిస్టులకు మాత్రమే పరిమితమైన పదం కాదు."

"మీకెప్పుడైనా వేరొకరి భార్యతో సంబంధాలున్నవా ?"

(అడల్టరీ అని అడుగుతారు)

"నాకు తెలిసినంతమటుకు అటువంటి సంబంధం లేదు."

"ఈ దేశం మీదకు ఎవరైనా దండెత్తితే మీరు ఈ దేశం కొరకు పోరాడతారా?"

"తప్పకుండా ! ఈ దేశాన్ని నేను ప్రేమిస్తున్నాను. ఇది నా యిల్లు. ఇక్కడే నేను 40 సంవత్సరాలు నివసించాను."

"కాని మీ రెప్పుడూ ఈ దేశ పౌరుడు కాలేదే?"

"పౌరుడు కాకుండా ఉండకూడదని ఏమీ లేదే ? నా పన్నులన్నీ యిక్కడే చెల్లిస్తున్నానే?"

"కానీ పార్టీ పంథాను ఎందుకు అనుసరించరు?"

"పార్టీ పంథా అంటే ఏమిటో మీరు చెప్పితే, దానిని అనుసరించాలా?" "లేదా? నేను చెపుతా !"

ఆ తర్వాత అమెరికా ప్రభుత్వమే తనను రాజకీయ విషయాలలో ఎలా యిరికించిందో చాప్లిన్ వివరించాడు వారికి. అలా మూడు గంటలపాటు ప్రశ్నల పరంపర అయిన తర్వాత వారం రోజులలో అమెరికా పునఃప్రవేశ అనుమతి దొరుకుతుంది. ఆ తర్వాత బ్యాంకులలో ఉన్న ధనాన్నంతా లాకర్లలో దాచుకుని చార్లీ దంపతులు అందరి దగ్గరా సెలవు తీసుకొని ఇంగ్లాండ్ బయలుదేరారు. బయలుదేరేముందే వారంరోజులు దాదాపు రహస్యంగా ఉండవలసి వచ్చింది. అమెరికా ప్రెస్‌వాళ్ళ విమర్శలు, కోర్టులలో లేనిపోని దావాలు, సమన్లు అందుకోకుండా చూడవలసి వచ్చింది. న్యూయార్క్ నుండి బయలుదేరేటప్పుడు తాను ఒక్కడే చూడవచ్చిన వాడుకూడా ఒక్కడే ! అతన్ని కూడ చూడలేకపోతాడు. నావ గదిలో గడియ పెట్టుకొని నావ బయలుదేరేదాకా ఎవరినీ చూడవద్దని చాప్లిన్ లాయరు సలహా.

అమెరికా తీరాన్ని వదిలిపెట్టేటప్పుడు సినీ ప్రపంచపు మాయలోనుండి బయటపడ్డట్టు, అపవాదులన్నీ తొలగిపోయినట్లు, భార్య పిల్లలతో తానువేరే వ్యక్తిగా భావించాడు చాప్లిన్ విషాదచ్ఛాయలు తొలగి చాలా సంతోషంగా ఉన్నట్లనిపించిందతనికి ఇంతలోనే ఒక కేబుల్ ! అమెరికాలో తిరిగి ప్రవేశించాలంటే, ఇమిగ్రేషన్ శాఖకు తనపై వున్న రాజకీయ ఆరోపణలకు, అవినీతినిందలకు సమాధానాలు ఇవ్వవలసి ఉంటుందని. దీనికి చాప్లిన్ నుండి సమాధానం కావాలని అమెరికా పాత్రికేయుల ప్రశ్నలు ! మళ్ళీ విషాదం, విచారం. అమెరికాలో జరిగిన అవమానం, పరాభవం గుర్తుకు వచ్చి అమెరికా మళ్ళీ పోగూడదని, ఇదే విషయం సమాధానంగా చెపుదామనుకున్నాడు కాని, తాను సంపాదించిందంతా అమెరికాలోనే వున్నది. కనుక అలా చెపితే ఏదో ఒక నెపంమీద ఆస్తిని జప్తు చేయవచ్చని భయపడ్డాడు. అందుకని మనసును సమాధాన పరుచుకొని, అమెరికా తిరిగి వచ్చినపుడు ప్రభుత్వ ప్రశ్నలకు సమాధానాలు చెపుతానని కేబుల్‌కు జవాబు పంపాడు. అలాగే ప్రపంచం నలుమూలలనుండి ప్రెస్ రేడియోగ్రామ్స్ వచ్చాయి. చాప్లిన్‌ను మాట్లాడమని ! ప్రయాణంలో నావ ఆగినపుడల్లా వందలాది పాత్రికేయుల ప్రశ్నలు, ఇబ్బందులు.

ఇరవై సంవత్సరాల తర్వాత మళ్ళీ లండన్ నగర ప్రవేశం. లండన్‌లో మామూలు స్వాగతం లభించింది. లండన్ నగరంలో చాలా మార్పులు జరిగాయి. చిన్ననాడు తానున్న యిళ్ళు, ప్రదేశాలు, వాళ్ళు ఎలా జీవించింది, అన్నీ చూపించాడు తన భార్యకు, భార్యాపిల్లలకి యూరప్ నచ్చుతుందా? అని చాప్లిన్ ఆలోచన. తర్వాత ఎక్కడ స్థిరపడాలో తెలియదు. చాలా యిబ్బందులు పడ్డారు కొన్నాళ్లు. ధనమంతా అమెరికా బ్యాంకులో వుండటం వలన చాప్లిన్ భార్య పదిరోజులపాటు ఆమెరికా వెళ్ళింది. అక్కడ బ్యాంకు వాళ్ళు ఆమెను సరిగా గుర్తించలేదు. ఆదరించలేదు. పోలీసులు తమ యింట్లోవున్న నౌకర్లను రెండుసార్లు ప్రశ్నించారు! చాప్లిన్ ఎటువంటి వ్యక్తో తెలపమని, చెడ్డ అలవాట్లు ఏముండేవనీ, జాతి ఏమిటని, యింకా ఎన్నో అడ్డదిడ్డ ప్రశ్నలు వేసి వాళ్ళను వేధించారు. ఇవన్నీ చాప్లిన్ భార్యకు పనివాళ్ళు చెపుతారు.

లండన్‌లో చాప్లిన్ మిత్రులు ఆయనను అమెరికాలో అన్ని నిందలతో, అవమానాలతో ఎలా వున్నావనీ? ఆ వ్యతిరేకత నెలా తట్టుకోగలిగావనీ అడిగారు.

తాను చేసిన పాపమంతా ఏ విశ్వాసానికి చెందకుండా (Non - Confirmist) వుండటమేనని తానెపుడూ కమ్యూనిస్టు కానప్పటికీ, వాళ్ళను అసహ్యించుకోటానికి యిష్టపడక పోవటమేననీ సమాధానం చెబుతాడు. ఇది అమెరికా ప్రభుత్వంతోపాటు అందరినీ బాధ పెట్టిందని చాప్లిన్ చెప్పాడు. మూఢ దేశభక్తులు అల్పసంఖ్యాక వర్గ హక్కులను కబళించివేసి, అమెరికాను ఒక ఫాసిస్టు రాజ్యంగా మార్చటానికి ఆలోచిస్తున్నారని కొన్ని శక్తుల ప్రాబల్యంవల్ల అదృశ్య ప్రభుత్వ శక్తులవల్ల, జాతి వ్యతిరేకతకు గురి ·అయ్యానని, దురదృష్టవశాత్తు అమెరికా ప్రజల ప్రేమానురాగాలను కోల్పోయానని వాపోయాడు.

లైమ్ లైట్ చిత్రాన్ని లండన్‌లో ప్రదర్శించారు. చాప్లిన్ సినిమా చూచిన తర్వాత ఏడ్చాడు! రచయిత తన రచనను తానే చూచి భావోద్రేకత చెందకపోతే ప్రేక్షకులు మెచ్చుకోవటం కష్టమంటాడు చాప్లిన్. ప్రేక్షకులకంటే కూడా తన హాస్య సినిమాలు చూచి తానే ఆనందపడతా నంటాడు.

## చాప్లిన్ మానవీయతా భావాలు

చార్లీ చాప్లిన్ తన సుదీర్ఘ జీవితంలో అనేక రకాల వ్యక్తులను కలుస్తాడు. చాప్లిన్ జీవితంలో ముఖ్య ఘట్టం అందమైన ప్రముఖమైన స్త్రీలతో సాంగత్యం, ఎందరో ఆయన్ను ప్రేమిస్తారు-కాని ఆయనకు మట్టుకు ఈ 'ప్రేమలో' విశ్వాసం లేదు. 'ప్రేమ ఒకపోటీ. ఆ పోటీలో ఒకరికి విజయం మరొకరికి అపజయం అందుకనే ప్రేమించనంటాడు.' అయినా నలుగురిని వివాహమాడాడు - ఇంకా కొందరిని చేసుకుందామనుకున్నాడు - కాని ఎవరితోనూ అతి సన్నిహితంగా మసలుకోడు. అయినా ముగ్గురి వలలో పడ్డాడు పాపం పసివాడు! అనేక యిబ్బందులకు గురిఅయ్యాడు. చివరికి నాల్గవ భార్యతో సుఖపడ్డాడు. ఆమె మంచిది కనుక ! అమెరికాలో తన అవమానాలకు, అపనిందలకు ముఖ్య కారణం విచ్చలవిడిగా స్త్రీలతో తిరగడమే.

ఎటువంటి వ్యక్తులతో కలవటానికి తాను యిష్టపడతాడో వ్రాస్తూ, సినిమా తారలతో కలసి తిరగటం యిష్టం లేదంటాడు. "తారలతో తారలు వెలుగని, చల్లదనాన్ని కలిగించలేవంటాడు." రచయితలు చాలా మంచివాళ్ళనీ, అయితే వాళ్ళకు తెలిసింది ఎవరికీ చెప్పరనీ, పుస్తకాలలో మాత్రమే వ్రాస్తారనీ అంటాడు

చాప్లిన్. శాస్త్రవేత్తలను కలవడం చాలా గొప్ప అనీ, అయితే వారిని డ్రాయింగ్ రూంలోకి ఆహ్వానించటంతోనే అందరూ మానసికంగా కృంగిపోతారంటాడు. చిత్రకారులతో సాంగత్యం విసుగనీ, వాళ్ళు చిత్రకారులకంటే తాత్వికుల మనుకుంటారనీ భావిస్తాడు. కవుల సాంగత్యం అన్నిటికంటె చాలా గొప్పదనీ. కవులు చాలా ఆనందంగా వుంటారని, దేన్నైనా భరించగలరని, మంచి స్నేహితాన్ని కురిపిస్తారని అంటాడు చార్లీ. అయితే సంగీత కళాకారులు కూడా సాంగత్యంలో సహకరిస్తారని, సగటున అందరికంటే ఎక్కువగా సంగీత కళాకారుల స్నేహితం ఆహ్లాదాన్నిస్తుందంటాడు.

మతంలో విశ్వాసం లేదంటాడు చార్లీ. మతం ఒక సిద్ధాంతాన్ని మూఢంగా నమ్మటం అయితే, కళాభావన నమ్మకాని కంటే గొప్పదంటాడు.

అమెరికా నుండి నిష్క్రమణం తర్వాత, ఇంగ్లాండులో బ్రిటిష్ ప్రభుత్వ అధినేతలతో అణు విధానాన్ని గురించి మాట్లాడుతూ, బ్రిటన్ తటస్థంగా వుండాలంటాడు. ఆయన్ను ఎవరూ వినిపించుకోరు. ఆనాడు తాను చూస్తున్న ప్రపంచాన్ని గురించి వ్రాస్తూ, ఆధునిక జీవితం అనేక కారణాలవల్ల సంక్లిష్టమయిందనీ, బృహత్తర వ్యవస్థల అభివృద్ధిలో వ్యక్తి కుదించబడ్డాడనీ, రాజకీయంగా, ఆర్థికంగా, శాస్త్రీయంగా అన్ని పక్షాల నుండి వ్యక్తి ఉనికికి ప్రమాదం ఏర్పడిందనీ, అనుమతులకు, పర్మిట్లకు వ్యక్తి బలి అవుతున్నాడనీ దానంతటికి కారణం సాంస్కృతికంగా అంతర దృష్టిలోపమే ( Lack of cultural Insight) నంటాడు. జీవిత సౌందర్యాలను ఆనందించటం కోల్పోయి, గుడ్డిగా మన జీవితాలను ఇరుకులోకి, రోతలోకి నెట్టుకున్నాం. లాభాలు, అధికారం, గుత్త వ్యాపారం వల్ల మన జీవితాలు మొద్దు బారినాయి. మన జీవితాలలో రాబోయే ప్రమాదకర పరిస్థితులను లెక్క చేయకుండా ఈ ప్రబలమైన శక్తులకు మనం తలవొగ్గి అనుమతించామంటాడు.

విజ్ఞానశాస్త్రం సరైన ఆలోచనా దృక్పథం లేకుండా, బాధ్యతారహితంగా రాజకీయనాయకుల చేతుల్లో వినాశకర మారణాయుధాల నుంచిందనీ, భూమిమీద ఉన్న ప్రాణికోటి జీవిత గమ్యాన్ని వాళ్ళ చేతుల్లో పెట్టిందనీ విచారించాడు.

పరిణామాలను గురించి పట్టించుకోకుండా మానవుడు ప్రతిదానిని గురించి తెలుసుకోవడం తప్పదనీ, కొందరు శాస్త్రజ్ఞులు మత మౌఢ్యులవలె, వాళ్ళు కనిపెట్టింది ప్రతిదీ మంచికేనని, ప్రతిదానిని గురించి తెలుసుకోవటం, వారి నైతిక బాధ్యతగా ప్రవర్తిస్తున్నారంటాడు.

అంతులేని అధికారాలున్న రాజకీయ నాయకులు నైతిక బాధ్యత లేనివారనీ, మేధా పరిజ్ఞానం అంతంత మాత్రం కలవారనీ, ఎప్పుడూ ఈ గొప్పవాళ్ళ అధికారాన్ని ప్రశ్నించవలసిందేననీ, ఈ భూమిమీద జీవితాలను ఎప్పుడో యుద్ధంలో అంతమొందిస్తారని, అయినప్పటికీ మనం గుడ్డిగా వాళ్ళ వెంబడే పోతున్నామని విచారించాడు.

మానవుడు పశువువలె ప్రాధమికంగా జీవించి ఉండటానికే ప్రాధాన్యత యిస్తున్నాడంటాడు చార్లీ. అందుచేత అతని తెలివితేటలు బాహ్య రూపంలో ముందు అభివృద్ధి అయిన ఆ తర్వాతే అతని ఆత్మ అభివృద్ధి జరిగింది. ఆ విధంగా మానవుని నైతిక ప్రవర్తనకంటె ముందు శాస్త్రాభివృద్ధి జరిగిందంటాడు. మానవ ప్రగతి పథంలో మానవుడు తాను బ్రతుకుతూ ఇతరుల అభివృద్ధికై పరోపకార చింతనతో పాటుపడటం చాలా నెమ్మదిగా అలవడుతున్నది. శాస్త్రీయాభివృద్ధి తర్వాత, దాని వెంట ఎన్నో అడ్డంకులు తొలగించుకుంటూ ముందు కాళ్ళతో ప్రాకుతూవుంది. పరిస్థితుల ప్రభావ కారణంగా ఇలా జరిగిందంటాడు చార్లీ.

మానవుడు తాను జీవిస్తూ, ఇతరుల అభివృద్ధికి తోడ్పడటం ( Altruism) అనే సిద్ధాంతంవల్లగాని, ప్రభుత్వాల ధానధర్మాలవల్లగాని పేదరికం తగ్గిపోదని, గతి తార్కిక భౌతికవాద శక్తుల వత్తిడికి మాత్రమే పేదరికం తగ్గు ముఖం పట్టిందంటాడు.

చార్లీ చాప్లిన్ తాను స్వయంగా ఆకలి బాధనూ, దుర్భర దారిద్ర్యాన్నీ, కడు పేదరికాన్ని చెప్పలేనంతగా అనుభవించినవాడు కావటంవల్ల, తన చిత్రాలన్నిటిని పేదవాళ్ళ కోసం, సామాన్య మానవుల బాధలను వాస్తవికంగా చిత్రీకరిస్తూ తాను బాధా సర్పదష్టులకు, దగాపడిన తమ్ములకు, పేదవాళ్ళకు ప్రతినిధిగా నిలబడుతాడు. తన ట్రాంప్ పాత్ర ద్వారా జీవిత వాస్తవాలను ప్రతిబింబిస్తూ మానవ నాగరికతను హేళన చేస్తాడు. హాస్య కరుణ వినోద రసాలతో సున్నితంగా, చమత్కారంగా, మానవ ప్రగతి పథంలో మానవుడు తన ప్రగతి నెలా అప్రయోజకత్వం పాలు చేస్తాడో హేళన చేసి మన కళ్ళకు మన తప్పులను కన్పింప చేస్తాడు.

1913 - 14 లలో శాన్ ఫ్రాన్సిస్కోలో అనుకోకుండా తిండీ తిప్పలు లేకుండా, మాసిన బట్టలతో దీనంగా బ్రతుకు తెరవు కానక తిరిగే ఒక దేశదిమ్మరిని (Hobo) చూశాడు. అతన్ని దగ్గరిలోనున్న హోటల్‌కు తీసుకుపోయి, తినిపించి త్రాగించి

అతని సంగతి కనుక్కొంటాడు - అతనొక మధ్యతరగతికి చెందిన పల్లెటూరు రైతు. అయితే తిండికి జరగక, అనేక పనులు చేసి విసిగి, స్థిరమైన పని ఏదీ దొరకక బాధ్యతారహితంగా దేశాలు పట్టుకు తిరుగుతుంటాడు అతని దగ్గరి నుండి జీవితాన్ని గురించి ఎంతో తెలుసుకొంటాడు. అతడు స్వయంగా అనుభవించిన పేదరికాన్ని కష్టాలను ఈ తిరుగుబోతు నుండి వివరంగా తెలుసుకొని. అతని పాత్రనే తన ట్రాంప్‌గా దాదాపు వంద చిత్రాలలో వివిధ పాత్రలలో అన్నీ మధ్యతరగతి లేక పేదవాళ్ళ పాత్రలలో అన్నీ మధ్యతరగతి లేక పేదవాళ్ళ పాత్రలను వేశాడు

అయితే చాప్లిన్ పేదరికాన్ని, పేదవాళ్ళని కూడా హేళన చేశాడు బీద వాళ్ళంతా మూర్ఖులనుకుంటాడు. వాళ్ళెందుకు పేదరికానికి వ్యతిరేకంగా తిరగబడక దాన్నే ఎందుకు అంటిపెట్టుకుని వుంటారని ప్రశ్నించాడు. ప్రపంచం నిండా ధనరాసులు కుప్పలుగా వుంటే, వాటిని అనుభవించే హక్కు ప్రతి ఒక్కరికీ వుంటే, ధనవంతుల వుచ్చుల్లో పడి ఎందుకు నలిగిపోతున్నారనీ, ఆ వుచ్చుల్లో ఎలా చిక్కుకున్నారో తన సినిమాలలో చూపించాననీ, అంతకంటె తానేమీ చేయలేననీ, వాళ్ళు తిరుగుబాటుచేసి, ఆ వుచ్చుల్లోంచి ఎందుకు బయటపడరని వాపోతాడు కాని తాను మట్టుకు వాస్తవ జీవితంలో పేదరికాన్ని అనుభవించినా, పేదవాళ్ళకు మాత్రం ఏం చేయలేదు-మధ్యతరగతి జీవితాన్ని అనుభవిస్తూ, చాలా లోభిగా, పిసినారిగా, ధనాన్నే ప్రేమించి, అందమైన వస్తువులను, స్త్రీలను పొంది, ఎన్నో సామాజిక, రాజకీయ, ఆర్థిక బాధలనుభవిస్తూ దేశం కాని దేశంలో తిరుగుతూ, ఒక ఇల్లు లేక ఒక యింటి వాడు కాలేక, డబ్బు లేకపోతే జీవించలేనని తెలుసుకొని ధనాన్ని కూడబెట్టి తాను కోటీశ్వరుడయ్యాడు. ప్రభుత్వానికి మద్దతునివ్వడు. రష్యాకు మద్దతునిచ్చాడు. కమ్యూనిజాన్ని బోధించాడు, కమ్యూనిస్టు కాలేదు. అన్ని దేశాలు తిరిగినా రష్యాకు పోలేదు. కమ్యూనిజాన్ని అంగీకరించినట్టుగా ఎక్కడా చెప్పలేదు. తాను ప్రజాస్వామ్య వాదిగా, మానవ హక్కుల కోసం, మానవ స్వాతంత్ర్యం కోసం, మానవ ప్రగతికి మాననీయతకు బాటలు వేయడు. అందరూ సుఖంగా, శాంతంగా వుండాలనుకున్నాడు. కళాకారుడుగా చాలా గొప్ప వాడైనప్పటికి చాప్లిన్ వైరుధ్యాల పుట్ట. చారిత్రక అవగాహన, రాజకీయ పరిజ్ఞాన లోపంవల్ల నిర్దిష్టమైన జీవిత దృక్పథాన్ని ఏర్పర్చుకోలేకపోయాడు.

చాప్లిన్ జీవితకాలంలో ప్రపంచ చరిత్రలోని ప్రధాన ఘట్టాలను చూశాడు. తాను పుట్టి పెరిగిన దేశం ఇంగ్లాండు. తాను పుట్టేటప్పటికి వలసలన్నిటిని దోచుకుని, బ్రిటన్ ఎంతో ధనవంతమైన దేశంగా ఉన్నా, తనతో పాటు కోట్లాదిమంది

బీదరికంలో మగ్గుతూనే ఉన్నారు. చాప్లిన్ స్వయంగా దుర్భర జీవితాన్ని చవి చూశాడు అలాగే తాను అమెరికా చేరేటప్పటికి, అది అప్పటికే శ్రీమంతుల దేశం. అక్కడ కూడా పేదవాళ్ళను చూశాడు. పారిశ్రామిక విప్లవం వచ్చి బీదవాళ్ళను మరింత పేదవాళ్ళగా నిరుద్యోగులుగా మార్చింది. ప్రథమ ప్రపంచ సంగ్రామం, రెండవ ప్రపంచ యుద్ధం, ఈ రెండింటి మధ్య రష్యా కమ్యూనిస్టు విప్లవం. ఒక ప్రక్క నాజీ దురహంకార నిరంకుశత్వం, మానవ మారణ హోమం, మరొక ప్రక్క ప్రజాస్వామ్యం కోసం పోరాటం, అణువిచ్ఛేదనం, ఎక్కడ చూసినా యుద్ధచ్ఛాయలు, ఎన్నడూ జరగనంతటి శాస్త్రీయ సాంకేతికాభివృద్ధి, చైనాలో కమ్యూనిస్టు విప్లవం, భారతదేశంలో యితర వలస రాజ్యాలలో స్వాతంత్ర్యం కోసం దశాబ్దాల పోరాటాలు. ఎన్ని జరుగుతున్నా తాను బీదవాళ్ళ పక్షమేనని, నిరంకుశత్వానికి వ్యతిరేకమని, మానవ స్వేచ్ఛకోసం జరిగే పోరాటాలకు మద్దతునిస్తానని, ఎన్ని చెప్పినా తాను కమ్యూనిస్టు కాలేక, కమ్యూనిస్టు ముద్రను వేయించుకున్నాడు. ఇది చాప్లిన్ రాజకీయ చరిత్ర అవగాహనలో పెద్ద లోపం, అసమ్మతి వాదిగా చివరివరకు మిగిలి మానవ స్వేచ్ఛకు ప్రతినిధిగా, కళాకారుడుగా, ఒక నీతి కోవిదుడుగా మాత్రమే చరిత్రలో మిగిలిపోయాడు. మానవ నైజాన్ని అవగాహన చేసుకొని, మానవుని అట్టడుగునవున్న మానవత్వాన్ని బయటికి తీయాలని ప్రయత్నించాడు. దాని ద్వారా మానవునిలో మార్పు తెచ్చి మానవీయత ద్వారా మానవ మనుగడ సాగాలని ఆశించాడు. అయితే ఈ ప్రయత్నంలో విఫలమై చివరకు తాను హంతకుడుగా (మన్సూ వెర్డో చిత్రంలో) తయారవుతాడు. చివరకు హాస్య కరుణ పాత్రను తానే హతమార్చి తానుగా తనవు చాలిస్తాడు. (లైమ్ లైట్‌లో) తన దయార్ద్ర హృదయ తపనతో ఎందరినో పూరడించినా, తను మట్టుకు పూరడిల్లకపోగా విసిగి వేసారి, నాగరికతను, సంఘాన్ని, రాజకీయాలను చివరికి కళాజీవితాన్ని ఏవగించుకొని, హేళన పరిస్థితికి దిగజారుతాడు. ఆవిధంగా చార్లీ చాప్లిన్ జీవితాన్ని చదివి, ఆయన జీవితాన్నుండి అర్థం చేసుకోవాల్సింది చాలా వుంది. అందుకనే చార్లీ చాప్లిన్ జీవిత చరిత్రను గురించి చదవాల్సి వుంది.

మేధావుల ఆలోచనలతోనే ప్రపంచ సమస్యలు ఒకదారికి వస్తాయి. కాని అట్టి పరిస్థితి రావాలంటే మనిషిని తీవ్ర ఆందోళన గల పరిస్థితులలోకి నెట్టాల్సి వుంటుందని, ఆ విధంగానే అణువిచ్ఛేదన జరిగిన తర్వాత మనిషి ఒక మూలకు నెట్టబడి ఆలోచింపజేసేట్టు చేసిందంటాడు చాప్లిన్. మానవ కల్యాణం. వినాశనం

రెండూ మానవుని చేతిలో వున్నాయి. శాస్త్రీయాభివృద్ధి ఏదో ఒక నిర్ణయం తీసుకోమని బలవంత పెడ్తుంది. ఈ పరిస్థితిలో మానవుడు తాను జీవిస్తూ, అందరూ జీవించటానికి తోడ్పడడానికి, అతని మంచితనమే మానవజాతి విజయానికి దారి చూపుతుందని అశిస్తాడు చాప్లిన్.

అమెరికానుండి చాప్లిన్ నిష్క్రమించిన తర్వాత, ఇంగ్లాండుకు వస్తాడు తర్వాత పారిస్‌లో, రోమ్‌లో చాప్లిన్‌కు ఘన స్వాగతం లభిస్తుంది. ఫ్రెంచి ప్రభుత్వం ఆయనను గౌరవించింది. అదే రోజు ఫ్రాన్సులోని కళాకారుల సంఘాల సమాఖ్య ఘనంగా సన్మానించింది. సమాఖ్య అధ్యక్షుడు రోగర్ పెర్డినాండ్ వ్రాసిన సుదీర్ఘలేఖలో చాప్లిన్‌ను బహువిధాల కొనియాడాడు. ఆ లేఖ సారాంశమిది :

ప్రపంచం గౌరవించిన గొప్ప వ్యక్తులలో చార్లీ చాప్లిన్ ఒకరు. ఒక్క హాస్య వినోద చక్రవర్తేకాక, రచయితగా సంగీత జ్ఞానిగా, చిత్రనిర్మాతగా, అన్నిటికంటె మిన్నగా హృదయమున్న వ్యక్తి, కరుణామయుడు, విజ్ఞాని సామాన్య వ్యక్తిగా కన్పడుతూ, సునాయాసంగా హృదయాలను కరగింపజేస్తాడు. ప్రేమ అనురాగాలలో మన మనస్సులను ప్రభావితం చేశాడని వ్రాశాడు.

లైమ్‌లైట్ చిత్రం చూచి నిండు హృదయంతో నవ్వాం, దుఃఖించాం. చాలా వాస్తవమైన దుఃఖం నీది, చాలా విలువైన బహుమానంగా మాకిచ్చిన కన్నీళ్ళు మాకు నవ్వటం నేర్పావు, అపుడే ఏడ్చేటట్లు చేశావు మాకు తెలియకపోయినా, ఎవ్వరైనా వూహించగలరు. నీవు మాకిచ్చిన ఈ విలువైన బహుమతికి నీవెంత నష్టపోయావో, వెల చెల్లించావో, నీవు పడ్డ బాధలగురించి ఎవరైనా వూహించగలరు, గ్రహించగలరు. నీ జీవిత వాస్తవాల నుండీ అనుభవాలనుండీ, చిన్నచిన్న విషయాలలో ఎంతో లోతు, సత్యాన్ని చూపించావు. నీ జ్ఞాపకశక్తి అమోఘం. నీ బాల్యంలోని జ్ఞాపకాలకు నీవు విశ్వాసపాత్రుడవు. ఆ రోజుల్లో పడ్డవేదన, దుఃఖం, విషాద జీవితచ్ఛాయలు మరెవ్వరి మీద పడకూడదని, అటువంటి కష్టాలు మరెవ్వరికీ రాకూడదని, ప్రతివారికి ఆశలు కలిగించావు ఎంత కీర్తి సంపాదించినా, గతాన్నుండి వేరుగాకుండా గత విషాద జీవితాన్ని విస్మరించకుండా వుండటమే గొప్పతనం. గత అనుభవాలను జ్ఞాపకం వుంచుకొనటమే గొప్ప ప్రతిభకు కారణం. అందుకనే ప్రేక్షకులు అభిమానిస్తారు. ప్రేక్షకుల హృదయాలను మీటుతున్నట్లుంది నీ నటన, నీ నటన వాస్తవంలో రచయితగా, నటుడిగా, దర్శకుడిగా అన్ని పాత్రలనీ తానే వహించి, అన్ని పాత్రలనైపుణ్యాన్ని మేళవించి మానవత్వానికి సేవా మార్గం చూపించింది. అందుకనే చాప్లిన్ పనితనం ఎల్లప్పుడూ సాధారణత్వాన్ని

ప్రదర్శించింది. సిద్ధాంతాలలో గాని, శిల్పంలోగాని కుంటుపడలేదు. అదెల్లపుడూ తనను తాను బహిర్గతం చేసుకోవడంలోనే ఒక (Confession)విశ్వాసం, ప్రార్థన. ప్రతి ప్రేక్షకుడూ నీ వెంట వుంటాడు నిన్ననుసరిస్తాడు. నీవు అనుకున్నట్లే అతను భావిస్తాడు.'

ఫ్రెంచి రచయితలు, నిర్మాతలు, సంగీతకారులు, నటీనటులు, నాటక రచయితలు, అందరూ చార్లీ చాప్లిన్‌ను ఎంతగానో గౌరవించి వాళ్ళ సమాఖ్యలో గౌరవ సభ్యత్వాన్నిచ్చారు.

చార్లీ చాప్లిన్ మేధావి. ప్రపంచానికి ప్రసాదించిన ఏకైకమేధావిగా బెర్నార్డ్‌షా చార్లీ చాప్లిన్‌ను కీర్తించాడు! చాప్లిన్ మిత్రులలో వామ పక్షానికి చెందిన మేధావులుండటం వలన, వామపక్ష రాజకీయాల వైపు మొగ్గు చూపుతుండేవాడు. అంతమాత్రానికే అమెరికా ప్రజాస్వామ్య ప్రభుత్వం చాప్లిన్‌కి కమ్యూనిస్టు ముద్రవేసి దాదాపు 13 సంవత్సరాలు అనేక విధాలుగా ఆయన్ను కష్టాలు పెట్టి చివరికి 1952లో అమెరికా నుంచి దేశ బహిష్కరణకు గురిచేసింది. ఇదీ అమెరికా ప్రజాస్వామ్యం ఒక స్వచ్ఛంద కళాకారునికి చేసిన గౌరవం ! చాప్లిన్ కళాకారుడుగా తను చెప్పదలచిన దానిని నిర్భయంగా, ధైర్యంగా చెప్పగలిగాడు. తాను చెప్పదలచింది మాటలద్వారా చెప్పలేదు మూగ భాషతోనే మౌనంగా నిశ్శబ్దంగా ఆయన భావాలను ప్రకటించాడు. తానుగా మొదట మాట్లాడింది. "ది గ్రేట్ డిక్టేటర్" చిత్రంలో మాత్రమే. అంతకు ముందు మోడర్న్ టైమ్స్ లో ఒక హంసగీత (Swan Song) పాడుతాడు. సకలభాషల స్వరాలు విచిత్రంగా పలికిస్తాడు. ఆ పాట చాలా గమ్మత్తుగా వుంటుంది. ప్రపంచాన్ని ఫాసిస్టు నిరంకుశత్వచ్ఛాయలు కమ్ముతున్నపుడు. తాను మాట్లాడాడు, కాదు ఒక సుదీర్ఘమైన ప్రసంగాన్ని చేశాడు.

ఆయన అన్ని చిత్రాల్లో మానవ జీవితాన్ని నిశితంగా విమర్శించాడు. సామాన్య జనుల బాధలు, గాథలు, ఆనందం, విచారం, సంతోషం, శోకం, తృప్తి, అసంతృప్తి ఆయన ప్రదర్శించాడు. ప్రత్యేకంగా మధ్యతరగతి వూహించుకునే అసత్య విలువలు ఎలా భగ్నం కాబడతాయో తన ట్రాంప్ పాత్ర (దానికి "చార్లట్ " అనే పేరు పెట్టుకుంటాడు) ద్వారా సాంఘిక వ్యవస్థలోని ఘోరమైన లోపాల్ని ఎత్తిచూపుతాడు. ఇంతకుముందే వ్రాసినట్లు చాప్లిన్ రాజకీయ అవగాహన లోపంవల్ల ఏ రాజకీయాల్ని సమర్థించలేకపోవటంతో సామాజిక సమస్యలకు తన చిత్రాలలో ఎన్నడూ ఎటువంటి పరిష్కారమార్గాలు చూపించలేదు. సమస్యలకు ఒక రాజకీయ

ప్రణాళిక ఇవ్వడు జీవిత నగ్న స్వరూపాన్ని వెండితెరపై ప్రశ్నించి, ఆ ప్రశ్నలకు సమాధానాలను మననే ఎన్నుకోమన్నాడు.

వాస్తవిక జీవితాన్ని విమర్శించటానికై కొంతవరకు అవాస్తవికతను ఆశ్రయించాడు అందుకని చార్లీ చాప్లిన్ కళ వాస్తవిక కళకాదు. అతని పాత్రలు యదార్థపాత్రల ప్రతిబింబాలు కావు అన్న విమర్శకూడా వుంది. ఏమైనాగాని చాప్లిన్ కళాకారుడేకాక ప్రజా సమస్యలను పట్టించుకున్న ప్రజా కళాకారుడు, ప్రజా నటుడు, ప్రజా దర్శకుడు. అందుకనే తాను జీవితంలో చేదు అనుభవాలు, ద్వేషం, అనాదరణ, క్రౌర్యం, దారిద్ర్యంతో నిరంతరంగా పోరాడి ఏడ్వలేక నవ్వి, నవ్వించి జీవిత విషాదాన్ని జయించి దారిద్ర్యం, అసమానత, పీడనం, క్రౌర్యం లేని సమాజం కోసం కలలు కన్నాడు. ఆయన కలలు మనకు వాస్తవాలు కావాలని ఆశించాడు

చార్లీ ట్రాంప్ పాత్ర ప్రపంచంలో ప్రసిద్ధిగాంచింది. ఆ పాత్ర మానవత్వానికి ప్రతినిధి, బహుముఖమైంది. ఏ నటుడూ, ఏ నాట్యకారుడూ కూడా ఎప్పటికీ ఆ పాత్ర కలిగించే ఉద్రేక తీక్షణతనూ, నటనాకౌశలాన్ని అధిగమించలేక పోవచ్చు నంటాడు జేమ్స్ ఆగి అనే రచయిత. ట్రాంప్ పాత్ర రెండు ప్రశ్నలు వేసుకుంటుంది. నేనున్నానా ? నేనెవరిని ? ఈ ప్రశ్నల సమాధానాల అన్వేషణలో సృజనాత్మక కళారూపంలో తన్ను తాను గుర్తించుకోవడానికి ప్రయత్నం చేసింది అంటాడు ఫ్రాంకోయిస్ టుపాట్ అనే రచయిత.

మొదటి ప్రపంచ యుద్ధ అరంభంలో జన్మించిన ట్రాంప్ రెండవ ప్రపంచ యుద్ధకాలం నాటికి ఎదిగి, రెండు యుద్ధాల మధ్య జరిగిన చరిత్రక్రమంలో పరిణామం చెందుతాడు. అభివృద్ధి చెందుతున్న పారిశ్రామీకరణ, గుత్త పెట్టుబడిదారీ విధానం, ఫాసిస్టు ధోరణులను ఈసడిస్తూ, ఆధునిక ప్రచ్ఛన్న యుద్ధకాలం నాటికి ట్రాంప్ పాత్ర చాలా మార్పు చెందింది. మొదటి నుండి చార్లీ కళాకారుడుగా, వ్యక్తిగా అందరినుండి వేరు అవుతాడు. ఉదార తాత్వికుడుగా, మానవతావాదిగా హిరోషిమా అణుబాంబు మారణాస్త్రానికి గురి అవుతాడు. ప్రచ్ఛన్న యుద్ధ రాజకీయాలకు తన రాజకీయ, వ్యక్తిగత జీవితాన్ని, బలియిస్తాడు. (లైమ్ లైట్‌లో) ఫిలిం పరిశ్రమలో పెద్దఎత్తున వ్యాపారం, సాంకేతిక శాస్త్ర మార్పులు, తానొక ప్రత్యేక కళాకారునిగా మూగ వేదననైనా అనుభవించనీయకుండా చేశాయి. ఆ విధంగా ప్రపంచ సామాజిక, ఆర్థిక రాజకీయ పరిస్థితులు ట్రాంప్

పుట్టుకకూ, వృద్ధికీ, పతనానికి కారణమై చార్లీ చాప్లిన్ వ్యక్తిగా, ఉదార తాత్వికుడుగా, మానవతావాదిగా, కళాకారుడుగా ట్రాంప్ పాత్ర ద్వారా ఎలా పరిణామం చెందుతాడో మనకు తెలుస్తుంది.

ట్రాంప్ పాత్ర చార్లీ వ్యక్తిగత వాస్తవ జీవితానికి ప్రతీక. ఆ పాత్ర తన ప్రతిబింబమే. తనకొక నివాసమంటూ ఇల్లంటూ ఉండదు. చాప్లిన్ నాలుగవ భార్య ఊనాని తన 54వ సంవత్సరంలో వివాహ మాడేంతవరకు ఇంట్లో శాంతిలేదు-అసలు ఇల్లంటూ ఒకటి వుండేది కాదు. ఎక్కువ కాలం హోటళ్ళలో, క్లబ్బులలో, చాలా చౌకగా కిరాయికి వుంటూండేవాడు. బాల్యంలో లండన్ దుర్భర జీవితం, తండ్రి లేడు, తల్లి ఎప్పుడూ అనారోగ్యంతో (దాదాపు 30 సంవత్సరాలు) హాస్పటల్ పాలయ్యేది. తానొంటరిగా వుండవలసి వచ్చేది. అమెరికా వెళ్ళాక కూడా దాదాపు పదిహేనేళ్ళు ఒంటరితనాన్ని పోగొట్టుకోవటం కోసం తొందరపడి అందమైన ఆడపిల్లలతో తిరిగేవాడు. బలవంతంగా వివాహాలు చేసుకోవలసి వచ్చింది. అందుకని మూడు వివాహాలు విఫలమయ్యాయి. శాంతి వుండదు. ఊనాని పెళ్ళాడిన తర్వాతనే ఇంట్లో శాంతి దొరుకుతుంది. కాని సమాజంలో, అమెరికాలో అప్రతిష్టపాలయి దేశ నిష్క్రమణకు గురి అవుతాడు. ఎక్కిడికి పోవాలి? ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ చైనాలలో వుండాలని తిరుగుతాడు. హాంకాంగ్‌లో స్థిరపడాలనుకుంటాడు. చివరికి వార్ధక్యంలో స్విట్జర్లాండులో ఒక చిన్న గ్రామంలో "నివాస" మేర్పర్చుకుంటాడు. తన శేష జీవితాన్ని దాదాపు 25 సంవత్సరాలు స్విట్జర్లాండులోనే గడుపుతాడు. జీవితాంతం కళకోసం పాటుపడ్తూనే ఉండేవాడు. కళకే జీవితాన్ని అంకితం చేసుకొన్న కళాజీవి.

లైమ్ లైట్ చిత్రం తర్వాత లండన్‌లో 1957లో "ఎ కింగ్ ఇన్ న్యూయార్క్" (A King in New York) చిత్రాన్ని తీశాడు. ఆ తర్వాత పదేళ్లకు 1967 లో తన 76 యేట "ఎ కౌంటెస్ ఫ్రమ్ హాంగ్‌కాంగ్" (A Countess from HongKong) అనే చిత్రాన్ని తీశాడు. ప్రఖ్యాత నటుడైన మార్లన్ బ్రాండో, ప్రసిద్ధ నటి సోఫియా లొరెన్ నాయికా నాయకులు. ఈ చిత్రం విజయవంతం కాలేదు. చాప్లిన్ ఈ సినిమాలో ఒక నిముషంపాటు హోటల్ బేరర్‌గా కనపడతాడు. ఈ సినిమా ఎందుకు తీశాడో ఆయనకే అర్థంకాదు. మార్లన్ బ్రాండో, నాయకుడు ఇదే విషయాన్ని అడిగితే నాకే తెలియదంటాడు చాప్లిన్. ఇది చార్లీ చాప్లిన్ దర్శకత్వం వహించి నటించిన చివరి చిత్రం. అప్పటికే 76 సంవత్సరాలైనా, విసుగు విరామం లేకుండా కష్టించే కష్టజీవి, కళాజీవి.

1962 లో అక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం చాప్లిన్‌కి డాక్టర్ ఆఫ్ లెటర్స్ గౌరవ డాక్టరేట్ బిరుదునిచ్చి సన్మానించింది. ప్రసిద్ధ చరిత్రకారుడు ట్రెవర్ రోపర్ చాప్లిన్‌కి జరిపిన సన్మానానికి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాన్ని తీవ్రంగా విమర్శిస్తాడు. ఒక హాస్య నటుడికి, బఫూన్‌కి అంతటి గౌరవం చేయటం ఘోరం, పెద్ద తప్పు అని ఈసడించుకున్నాడు. అయితే ఆయన విమర్శను ఎవరూ పట్టించుకోలేదు.

1975లో చాప్లిన్‌ను "నైట్" (Knight) బిరుదంతో బ్రిటిష్ ప్రభుత్వం సత్కరించింది లండన్‌లో. ఒకనాడు కొన్నేళ్ళు లండన్ మురికివాడల్లో నికృష్టంగా జీవించిన చాప్లిన్‌కి బ్రిటిషు సామ్రాజ్య అత్యున్నత బిరుదు పొంది "సర్ చార్లెస్ చాప్లిన్ నైట్ కమాండర్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ బ్రిటిష్ ఎంపైర్" అయ్యాడు

అమెరికా నుండి తిరిగి వచ్చిన తర్వాత 30 సంవత్సరాల వరకు చాప్లిన్ మళ్ళీ అమెరికా వెళ్ళలేదు. 1976 లో అవసాన దశలో చివరిసారిగా అమెరికా వెళ్ళాడు. అమెరికన్ సెనేట్ కాంగ్రెస్‌ల తరఫున చాప్లిన్‌కి అమెరికా దేశపు గౌరవ పౌరసత్వాన్ని యిచ్చి వైట్‌హౌస్‌లో ఘనంగా సన్మానించారు. పశ్చాత్తాపం చెందిన జాతి అని ప్రముఖ పత్రికలు సంపాదకీయాలు వ్రాశాయి. ఆ విధంగా చాప్లిన్‌ను అవమానించిన జాతి అయన్ను గౌరవించక తప్పలేదు.

1977 డిసెంబర్ 25న క్రిష్టమస్ నాడు తెల్లవారు ఝామున 4 గంటలకు నిద్రలోనే చార్లీ చాప్లిన్ ఈ ప్రపంచాన్ని వదలిపెట్టి, చిత్ర జగత్తులో శాశ్వత స్థానాన్ని పొందాడు. ఆనాటి అంత్యక్రియలకు చాప్లిన్ కుటుంబ సభ్యులు ఎవరినీ రానివ్వలేదు. చాలా సామాన్యంగా ఆయనకు అంతిమ వీడ్కోలు పలికారు. ప్రపంచం నలుమూలల నుండి ఆయన మరణానికి ప్రగాఢ సంతాప సందేశాలందినాయి. అత్యున్నతమైన అత్యుత్తమ మానవుడుగా కీర్తిపొందాడు.

" Nobody, as he did, knew to enter the hidden recess of the human heart with simplicity and popularity which became Legendary succeeding in causing Laughter by weeping and weeping by Laughter ".

# చార్లీ చాప్లిన్ చిత్రాలు

## కీస్టోన్ చిత్రాలు (1914)

| | |
|---|---|
| మేకింగ్ ఎ లివింగ్ | (1 రీలు) |
| కిడ్ ఆటో రేసెస్ ఎట్ వెనిస్ | (రీలులో భాగం) |
| మెబెల్స్ స్ట్రేంజ్ ప్రిడక్ మెంట్ | (1 రీలు) |
| బిట్వీన్ షవర్స్ | (1 రీలు) |
| ఎ ఫిల్మ్ జానీ (A Film Johnnie) | (1 రీలు) |
| టింగో టాంగిల్స్ | (1 రీలు) |
| హిస్ ఫేవరేట్ పాస్టైమ్ | (1 రీలు) |
| క్రూయల్ క్రూయల్ లవ్ | (1 రీలు) |
| ది స్టార్ బోర్డర్ | (1 రీలు) |
| మెబెల్ ఎట్ ది వీల్ | (2 రీల్సు) |
| ట్వెంటిమినిట్స్ ఆఫ్ లవ్ | (1 రీలు) |
| కాట్ యిన్ ది రెయిన్ | (1 రీలు) |
| ఎ బుజీ డే | (రీలులో భాగం) |
| ది ఫాటల్ మాలెట్ | (1 రీలు) |
| హర్ ఫ్రండ్ ది బాండిట్ | (1 రీలు) |
| ది నాక్ అవుట్ | (2 రీల్సు) |
| మెబెల్స్ బుజీ డే | (1 రీలు) |
| మెబెల్స్ మారీడ్ లైఫ్ | (1 రీలు) |
| లాఫింగ్ గ్యాస్ | (1 రీలు) |
| ది ప్రాపర్టీ మాన్ | (2 రీళ్ళు) |
| ది ఫేస్ ఆన్‌ది బార్ రూం ఫ్లోర్ | (1 రీలు) |
| రిక్రియేషన్ | (రీలులో భాగం) |
| ది మాస్క్డ్ రేడర్ | (1 రీలు) |
| హిజ్ న్యూ ప్రొఫెషన్ | (1 రీలు) |
| ది రౌండర్స్ | (1 రీలు) |
| ది న్యూ జానిటర్ | (1 రీలు) |
| దోజ్ లవ్ సాంగ్స్ | (1 రీలు) |
| డగ్ అండ్ డైనమైట్ | (2 రీళ్ళు) |
| జంటిల్ మన్ ఆఫ్ నర్వ్ | (1 రీలు) |
| హిజ్ మ్యూజికల్ కరీర్ | (2 రీళ్ళు) |
| హిజ్ ట్రిస్టింగ్ ప్లేస్ | (2 రీళ్ళు) |
| టిల్లీస్ పంక్చర్డ్ రొమాన్స్ | (6 రీళ్ళు) |
| గెటింగ్ యక్వైన్టెడ్ | (1 రీలు) |
| హిజ్ ప్రి హిస్టారిక్ పాస్ | (2 రీళ్ళు) |
| కాట్ యిన్ ఎ క్యాబరెట్ | (2 రీళ్ళు) |

## ది ఎస్సనే చిత్రాలు (1915)

| | |
|---|---|
| హిజ్ న్యూ జాబ్ | (2 రీళ్ళు) |
| ఎ నైట్ అవుట్ | (2 రీళ్ళు) |
| ది ఛాంపియన్ | (2 రీళ్ళు) |
| ఇన్ ది పార్క్ | (1 రీలు) |
| ది జిట్నీ ఎలోప్‌మెంట్ | (2 రీళ్ళు) |

| | |
|---|---|
| ది ట్రాంప్ | (2 రీళ్ళు) |
| బై ది సీ | ( 1 రీలు) |
| వర్క్ | (2 రీళ్ళు) |
| ఎ ఉమన్ | (2 రీళ్ళు) |
| ది బ్యాంక్ | (2 రీళ్ళు) |
| షంగైడ్ (Shanghaied) | (2 రీళ్ళు) |
| ఎ నైట్ యిన్ ది షో 1916 | (2 రీళ్ళు) |
| కార్మెన్ | (4 రీళ్ళు) |
| పోలీస్ | (2 రీళ్ళు) |
| ట్రిపుల్ ట్రబుల్ | (2 రీళ్ళు) |

## మ్యూచువల్ చిత్రాలు (1916)

| | |
|---|---|
| ది ఫ్లోర్ వాకర్ | (2 రీళ్ళు) |
| ది ఫైర్ మన్ | (2 రీళ్ళు) |
| ది వాగబోండ్ | (2 రీళ్ళు) |
| వన్ ఎ యమ్ | (2 రీళ్ళు) |
| ది కౌంట్ | (2 రీళ్ళు) |
| ది పాన్‌షాప్ (The Panshop) | (2 రీళ్ళు) |
| బి హైండ్ ది స్క్రీన్ | (2 రీళ్ళు) |
| ది రింక్ (1917) | (2 రీళ్ళు) |
| ఈజీస్ట్రీట్ | (2 రీళ్ళు) |
| ది క్యూర్ | (2 రీళ్ళు) |
| ది ఇమ్మిగ్రెంట్ | (2 రీళ్ళు) |
| ది ఎడ్వంచరర్ | (2 రీళ్ళు) |

## ఫస్ట్ నేషనల్ చిత్రాలు 1918

| | |
|---|---|
| ఎ డాగ్స్‌లైఫ్ | (3 రీళ్ళు) (యూనివర్సల్) |
| ది బోండ్ | (రీలులో భాగం) |
| షోల్డర్ ఆర్మ్స్ (1919) | (3 రీళ్ళు) |
| సన్నీసైడ్ | (3 రీళ్ళు) |
| ఎ డేస్ ప్లెజర్ (1920) | (2 రీళ్ళు) |
| ది కిడ్ | (6 రీళ్ళు) |
| ది ఐడిల్ క్లాస్ (1922) | (2 రీళ్ళు) |
| పే డే (1923) | (2 రీళ్ళు) |
| ది పిల్‌గ్రిమ్ | (4 రీళ్ళు) |

## యునైటెడ్ ఆర్టిస్ట్స్ చిత్రాలు (పూర్తి నిడివి)

1923 ఎ వుమన్ ఆఫ్ పారిస్
1925 ది గోల్డ్ రష్
1928 ది సర్కస్
1931 సిటీలైట్స్
1936 మోడర్న్ టైమ్స్
1940 ది గ్రేట్ డిక్టేటర్
1947 మన్స్యూ వెర్డో
(Mansiear Verdoux)
1953 లైమ్ లైట్
1957 ది కింగ్ ఇన్ న్యూయార్క్
1967 ఏ కౌంటిస్ ఫ్రమ్ హాంకాంగ్